శ్రీరస్తు

# శ్రీకృష్ణ
# రాయచరిత్రము.

వి. నారాయణకవి ప్రణీతము.

బొబ్బిలి సంస్థానాధిపతులు

మహారాజా రావు సర్

స్వేతచలపతి రంగారావు బహద్దర్ కే. సీ. ఐ. ఇ.

వారి యనుమతిని



చెన్నపురి :

రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటింపబడెను.

1914

All Rights Reserved.

అని యిష్టదేవతావందనంబును సుకవికవితాభివందనంబును కుకవినిందనంబునుం గావింపుచు నిదానీంతనమహావీరపురుషపౌరుషరసానుబంధబంధురం బగునొక్క ప్రబంధంబు రచియింపం గోరి యున్న సమయంబున.

శ్రుతగుడక్షోణభృత్క్షితిమండలోచిత
  ప్రాజ్యరాజ్యరమాధురంధరుండు
దానధారాధౌతధరణీసుపర్వాను
  సారిదారిద్ర్యరజస్తముండు
గీతసాహిత్యసరసవిద్యారస
  రసికతామహితసారస్వతుండు
ంతభూపాల సంస్తుతద్విప
  దానక్షమితసద్గాంగణుండు ఎస బాంధవుండు
తారాతిరాజన్యదర్పమథన
జితాటోప కేళి మల్రాజవంశ
వనహేళి రామనృపాలమౌళి. 10

డెబ్బదియేడుగోత్రముల కీవి వహించిన యాత్మవర్గపు
బ్బర మైనపౌరుషము నేర్పుమెయి న్వెలయ ల్పచింపుచో
బొబ్బిలిరావు వారల యపూర్వపరాక్రమ ముబ్బరంబుగా
బ్బినతచ్చరిత్రము ప్రబంధముఖంబున నాలకింపఁగన్.

మహోత్సాహం బుదయించి యుదంచితశాస్త్రప్రపంచ సరస్సంచరన్మనోహంసు లగువిద్వాంసులును కవిత్వరచనా చమత్క్రియాచరితోత్సవు లగుకవులును రాజకార్యస్వాతం

త్రు లగుమంత్రులును నాయకులును గాయకులును ర
గలపరివారంబు గొలువఁ గొలువుండి గోష్ఠివిశేష

మ. సనునానాపృథివీంద్రచంద్రకృతసన్మానుం రఘూ కూ
వసపాదాంబుజసేవనానిరతుసత్ప్రాచీనవిద్వత్క
శనికాయాదరణీయదిట్టకవివంశప్రోద్భవుం ధీరస
యను నారాయణుఁ జూచి యిట్లు పలికెం హాము శా
దేల్చుచున్.

తే. రామభూషావిశేషవర్ణనాత్రి
హారముఖ్యబహుకృతుల్ గారవమున
నందుకొంటివి మాచేత సద్గాత్రి
తాత్రిణివి దిట్టకవిరాజ యరుణతేజ. 14

ఉ. భారతయుద్ధమట్లు లతిభాసురతం గనుపట్టుచు న్మహా
వీరరసప్రధాన మగు వేడుక నింపెడునా ప్రవారిదు
[illegible]ప్రసంగమతిరమ్యతరం బది గద్యపద్యసం
ధారయుతంబుగా నొకప్రబంధ మొనర్పుమదంకితంబుగన్.

వ. అని యనూనయింపుచుం బరిమళపరిమిళిత కర్పూరవీటీ
కనకశాటీ నిరాఘాటధాటీ జనవఘోటీ పరంపరాది సత్కా
రంబులఁ బ్రియంబుఁగొలుపుటయుం గౌతూహలంబు వొ
డమి తత్ప్రారంభంబునకు మంగళోజ్జృంభణంబుగాఁ గృతి
పతివంశావతారం బభివర్ణించెద. 16

మ. సనకాదుల్ భజియింతు రెవ్వనిపదాబ్జాతంబునే పుణ్యశీ
లుని యంఘ్రిం జనియించి జాహ్నవి కడుం లోకత్రయీ
లోకపావని యౌనట్టి రమామనోహరుని దివ్యశ్రీపదాం

భోరుహం, బున జన్మించిరి పద్మనాయకులు విస్ఫూర్తిం బ్రవ
ర్తిల్లుచున్. 17

క. ఆపద్మనాయకాగ్రణు
లేపలరెడువేడ్క డెబ్బదేడుగోత్ర
వ్యాపాదితనియమస్థితి
దీపించిరి వెలమసంజ్ఞ తేజరిలంగన్ 18

క. ఆసప్తోత్తరసప్తతి
భాసురగోత్రములయందుఁ బ్రతిభాకరమై
భాసిలె విరియాలాఖ్యన్
వాసిం గలగోత్ర మొన్న వన్నె దలిర్పన్. 19

శా. కల్లోలి న్యధినాథతుల్యవిలసద్గాంభీర్యయుక్తుండు శారదో
త్ఫుల్లాంభోరుహవల్లరీ హిమఝరీ భూతేశవాక్సుందరీ
మల్లీ స్వర్ణహారీ కరీంద్రయశుఁడై మల్రాజువంశంబునన్
వల్లారాయనృపాలమౌళి వొడమెన్ వార్థిన్ మృగాంకా
కృతిన్. 20

సీ. తనచేతినిశితాసిధారావిధుంతుదుం
డహితాననేందుల నాక్రమింపఁ
దనరణభేరికాధ్వనిగర్జితంబులు
విమతహంసములకు వెఱపుఁ జూపఁ
దనవాహఖురపుటీజనితధాత్రీధూళి
పరిపంథికంధులమురువుడింపఁ
దనజయధ్వజవీరహనుమంతుఁ డభియాతి
యాదోనిధానంబు లవఘళింపఁ

తే. నలరు నమితవిరోధి ధరాధనాథ
రత్నమకుటాంశురాజినీరాజితాంఘ్రి
నఖరశిఖరసుధాంశుండు నయవచోభి
రామగీష్పతివల్లభరాయనృపతి. 21

సీ. ఆవల్లభనృపాల దేవవల్లభునకుఁ
దనయులు జనియించి రనఘమూర్తు
లసమానలసమానహారివాక్చాతురీ
పన్నగపతి పెదచ్చన్నగారు
శతమన్యుసన్నిభాద్భుతజగన్నుతసంప
దౌన్నత్యనిధి చినచ్చన్నగారు
వితరణశ్లాఘానపీనకర్ణఖ్యాత
ఘనకీర్తిశాలి జగ్గన్నగారు

తే. కొండమక్ష్మాతలాధిపాఖండలుండు
నాఁగ నలువురు దశరథనందనప్ర
తీతసౌభ్రాత్రకలితప్రదీప్తు లగుచుఁ
ద్రిజగదభినంద్యవైభవశ్రీలఁ దనర. 22

క. ఆనలుగురిలోఁ గొండ
క్ష్మానాయకుఁ డలరె దశదిశామానవతీ
మానిత నాసాభూషా
నానట దురుమౌక్తికాభనవ్యయశుండై. 23

సీ. ఆశ్రితప్రకరవన్యాదైన్యనిరసన
సంభ్రమాశ్రాంతవసంతఋతువు
విద్వద్గృహాంగణావిర్భూతనిజరూప
సంరంభయుతసౌరసౌరభేయి

కవిజనానీకలోకక్రమోదాపాది
విస్రంభశుంభత్సహస్రరశ్మి
సకలబాంధవచకోరకనికాయతపఃఫ
లాయితరాకాసుధాంశుబింబ
తే. మతఁడు నృపమాత్రుఁడే చతురంబురాశి
వలయితక్ష్మాసుపర్వానువర్ణ్యమాన
భూరివితరణవిజితమందారశాఖి
రాజితాకృతి కొండలరాయనృపతి. 24
మ. జలజాతాస్త్రభవప్రగల్భవచనశ్లాఘానిదాఘాటమం
జులతాలంఘనజాంఘికంబుల హిమాట్సన్న్యస్తపత్త్రివళీ
స్ఖలితాలాపకలాకలాపములు నైకస్వ్యక్షమల్రాజుకొం
డలరాయప్రభుసార్వభౌముని ప్రచండప్రౌఢవాగ్ఝల్లరుల్.
క. ఆకొండలరాయధరి
త్రీకాంతవతంసమునకు దివిషన్నటిసీ
వ్యాకోచపుండరీకర
మాకల్పయశుల్కుమారు లాఱ్వురు వరుసన్. 26
శా. లీలాసూనశరాసనుల్ వొడమి రా లింగన్న జగ్గన్నమా
పాలగ్రామణి రామభూమిపతియుం బార్థోపమాటోపదో
శ్శీలుండై తగు రామచంద్రనృపుఁడున్ శ్రీరంగక్ష్మావరుం
డోలిన్ మల్లనృపాలమౌళియు ననానుర్వీశచూడామణుల్.
క. వారలలోపలఁ గులవి
స్తారకుఁడై సుకవివిద్వదాధారుండై
ధీరోదాత్తుఁడు రామ
క్ష్మారామారమణుఁ డలరె సరసులు వొగడన్. 28

సీ. అతనిచేతికటారి కభియాతినృపశరీ
    రములు సజీవకోశములు గావె
యతనిశౌర్యాగ్నికి నభియాతినృపదుర్గ
    తండముల్ హోమకుండములు గావె
యతనియాగ్రహశక్తి కహితభూభృచ్ఛిరః
    కమలముల్ కబళకోశములు గావె
యతనిజయేందిరకరిరాజకరికుంభ
    నికరముల్ హారపేటికలు గావె
తే. భళిభళీ యని తనప్రతాపంబుఁ గాంచి
సకలదిగ్దేశనృపతులు సన్నుతింప
నలరు బెల్లపుకొండ ధరాధిరాజ
రాజమార్తాండమూర్తి యారామనృపతి. 29

మ. అలఘుశ్రీనిధియట్టిరామవసుధాధ్యక్షుండు గాంచెన్ గు
మారులమాద్రేయులఁ బోడురాజుకరణిన్ రుద్రప్రతా
పుండు కొం, డలరాయప్రభుసార్వభౌముఁడు ప్రచండా
టోపియౌ వేంకటరా, చలధాత్రీపతి నాఁగ నిర్వారమహా
సామ్రాజ్యధౌరేయులన్. 30

సీ. అర్థిదారిద్ర్యమహాంధకార మడంపఁ
    జంద్రార్కులతెఱంగు సంగ్రహించి
దుష్టనిగ్రహకళాదోహలస్ఫురణచే
    రామలక్ష్మణులబీరంబు నెరపి
శాత్రవోత్కరజయోత్సాహసాహసమున
    భీమార్జునులపోల్కెఁ దీముకొల్పి

లలితవిలాసలీలాచారుచర్యల
బలరామకృష్ణుల పటిమఁగల్గి
తే. వార లిరువురు సౌహార్దవైభవముల
నంచితస్ఫూర్తి మిగులఁ దీపించి రెలమి
రహిఁ వహింపుచుఁ గొండలరాయనృపతి
వేంకటాచలమహిభృత్ప్రియాంకమూర్తి. 31
క. అం దగ్రజుండు శశిభృ
చ్ఛందనమందారవిందసాంద్రయశశ్శ్రీ
లందెను కొండలరాయఁడు
రందరుఁడు నిజాస్యలక్ష్మీనురంజనకరుఁడై. 32
ఉ. కొండలరాయనిం గెలువఁ గోరు సమున్నతసత్కార్యసంపదన్
గొండలరాయనిం జెనకఁ గోరు నఖండితకాంతిభూతిచేఁ
గొండలరాయనిన్ సమతఁ గోరు సత్ప్రకరావనిప్రియన్
గొండలరాయభూరమణకుంజరుఁ డెన్న నృపైకమాన్యుఁడే.
సీ. దశరథసూతి యాధన్యుండు గాకున్న
నరిపంక్తికంఠసంహారి యెట్లు
బలరాముతమ్ముఁ డీప్రభుమౌళి గాకున్న
సత్యాభిరామప్రచారుఁ డెట్లు
రాకామృగాంకుఁ డీరమణుండు గాకున్న
కువలయానందనప్రవణుఁ డెట్లు
జంభవిద్వేషి యీజనపతి గాకున్న
నహితబలచ్ఛేది యగుట యెట్లు
తే. లని జనంబులు వెయినోళ్లఁ దనుభజింప
నప్రతీపప్రతాపమహాప్రదీప

శమితరిపువర్గదోర్గర్వతిమిరుఁ డలరు
రమ్యగుణహారి కొండలరాయశౌరి. 34

శా. ఆసౌభాగ్యబలారి గైకొనియె భార్యాయుగ్మముం గొండ
మాం, బాసాధ్వీమణిఁ జిన్నపాపమసతిం బద్మామనోభర్తల
క్ష్మీసర్వంసహల న్వరించుపగిదిన్ శ్రీరుక్మిణీ సత్యభా
మాసీమంతవతీవతంసములఁ బేర్మిం గృష్ణుచందంబునన్.

మ. అనసూయాసతి సన్నపూర్ణను బులోమాత్మోద్భవారుం
ధతీ, వనితారత్నములం బయోధితనయన్ వైదేహి
నశ్రాంతముం, దనసౌశీల్యపతివ్రతాత్వవినయౌదార్యాదు
ల న్మించి పే, ర్గాను కొండమ్మకు నింకఁ గాంత లెనయే
కొండొక్క రిమ్మేదినిన్. 36

సీ. తనదయాలీలాంచితనయవిశేషముల్
సకలార్థిజనములు సంస్తుతింపఁ
దనసాధువినయవర్తనసొంపు సేవించి
యుభయవంశంబులు నుత్సహింపఁ
దనగుణపారిజాతనవీనవాసనల్
నిఖిలకకుప్పాళి నిండికొనఁగఁ
దనతాల్మి కలిమి యింతనరాక వెగడొంది
తోడిచేడియల కుత్సుకత నెరప

తే. దనరు నాత్మీయసౌశీల్యదానధర్మ
విభవసౌభాగ్యకారుణ్యవిశదకీర్తి
సాధుమాధుర్యనయగుణసారముదిత
బంధునికురంబ శ్రీచినపాపమాంబ. 37

సీ. అందగ్రమహిషియం దలఘుప్రతాపుని
వేంకటరామపృథ్వీపతిలకు
సన్నుతౌదార్య సూరన్నప్రభూత్తంసు
రామభూమీమండలామరేంద్రుఁ
గొండొకసతియందు గురుశౌర్య వేంకట
నరసింహరాయభూవరవతంసు
ఘనునివల్లారాయ జననాయకవరేణ్యు
రామచంద్రకుమారరమణచంద్రుఁ
తే. గ్రమము దీపింపఁ బుత్రషట్కంబు గాంచె
మువుర మువ్వురసమతానుమోదలీల
నమ్మహాసాధుసాధ్వియుగ మ్మెలర్పఁ
బ్రబలరుచిహేళి కొండలరాయమౌళి. 38
తే. తత్తనూభవషట్కసౌందర్యధైర్య
శౌర్యచాతుర్యధుర్యతాసరణిఁ దెలియ
విన్నవించెద మిగుల వేర్వేర నెన్ని
సకలజనమానసానురంజకము గాఁగ. 39
సీ. ఏధన్యుసత్కీర్తి యిందుకుందమరాళ
ధారాళరుచులతోఁ దారసించు
నేధీరువితరణం బిసతనూసంభవు
విజ్ఞానసమృద్ధి వీటబుచ్చు
నేపీరుదోశ్శౌర్య మింద్రనందనుభుజా
పాండిత్యమునకు విభ్రాంతి యొసఁగు
నేభవ్యుసౌందర్య మిక్షుచాపనుమాన
సైన్యాగమముల నేర్పు గాంచు

తే. నతఁడు చెల్వొందుఁ బ్రణమితాహితశిరస్థ
రత్నమకుటమరీచిపూరప్రరోహ
రాజినీరాజితాంఘ్రినీరజయుగళి
రాజపవిధారి వేంకటరాయశౌరి. 40

సీ. తనరాజసంబు మాంధాతృభగీరథ
దశరథసగరులదశవహింపఁ
దనచక్కఁదనము కందర్పనైషధరాజ
రాజతనూజుల నోజఁ దెగడఁ
దనదానపటిమ రాధాసుతజీమూత
జీమూతవాహుల చెలువుఁ జూపఁ
దనపరాక్రమము మందాకినీనందన
శరవణోద్భవుల కచ్చెరువు నింప

తే. నిం పలరుఁ దారకాశరదిందుకుంద
శారదాశారదాభ్రమందారచంద్ర
దరహారవియత్స్రుతంగజధవళయశుఁడు
రాజదివిషద్విభుండు సూరప్రభుండు. 41

ఉ. క్రొన్ననవింటివాని యనుగుంజెలిచక్కఁదనంబునందు వే
గన్నులవానిపట్టి కధికం బగు జోదుపరాక్రమంబునన్
మిన్నులమానికం బపరిమేయరుచిస్ఫురణన్ మహోత్తురా
మన్నను బ్రస్తుతింపఁ దరమా ధరమానవకోటిలోపలన్. 42

సీ. అర్థార్థిజనకామితావాప్తి యొనరింప
నవనికి డిగ్గిన యమరతరువొ
కనకధారాసారగౌరవస్ఫురణంబు
నెరప వచ్చినయట్టి నీరదంబొ

భూలోకసంచారఖేలనానిరతిమైఁ
గనుపట్టుచుండెడి కామగవియొ
పత్త్రినాయకమణిభానంబు గైకొని
మహిఁ జెలంగెడువేల్పు మానికంబొ
తే. భళిర యితఁ డని తనుజను ల్ప్రస్తుతింప
వెలయు విరియాలగోత్రపవిత్రమూర్తి
చారుతరకీర్తి నరదేవచక్రవర్తి
భవ్యరుచిహారి రామభూపాలమౌళి. 43

సీ. తనరూపు మీనకేతనవసంతజయంత
సౌందర్యధిక్కృతియానరణిఁ బొదలు
దనవదాన్యతవికర్తనతనూజదధీచి
శిబికుబేరాదుల సిగ్గుఁబరచుఁ
దననీతిపాటిమ శాంతనవకామందక
చాణక్యమనువుల జాడఁ దెగడు
దనరాజసము పురాతనరాజలోకైక
చూడావతంసకస్ఫురణఁ దెలుచు
తే. శ్రుతగుడక్ష్మాభృదధిపుఁడై సొంపుఁ గాంచె
సైపుఖానవజీరభుజావలేప
లోపకృద్వీరవిజయప్రతాపశాలి
వేంకటనృసింహరాయ పృథ్వీపమౌళి. 44

శా. మల్లీవల్లరులన్ హసించు విలసన్మందారకుందారవిం
దోల్లోలన్నవమంజరీరుచులపై వాలుంకించు నభ్రాపగా
కల్లోలాంబుశుభప్రభానిభములై కన్పట్టు మలారిజు శ్రీ
వల్లారాయనృపాలచంద్రునియశోవల్లీసముల్లాసముల్. 45

క. ఆధన్యుని పినతండ్రి సు
ధాధారారుచిరరుచివిధాయకవాచా
మాధుర్యైకనిధానగు
ణాధారుఁడు వేంకటాచలాధిపుఁ డలరెన్. 46

సీ. అశ్రాంతవిశ్రాణనాభినంద్యప్రౌఢి
యినతనూభవునందు నితనియందు
నంగనాజనమనోహరరూపసౌష్ఠవం
బిందిరాసుతునందు నితనియందు
క్ష్మాభారభరణరక్షాదక్షదోశ్శక్తి
ధృతరాష్ట్రతనయునం దితనియందు
రణరంగవిజయశౌర్యప్రసంగనిరూఢి
యింద్రనందనునందు నితనియందుఁ
తే. గాని కాన మటంచు లోకము నుతింప
స్ఫుటతరౌదార్యరూపప్రభుత్వశౌర్య
ధర్మములయందు మూ రెండుఁ దనకు లేక
నలరు మల్రాజవేంకటాచలవిభుండు. 47

తే. అమ్మహాబాహుగేహిని యతిశయిల్లు
నాస్యలక్ష్మీనిరస్తసుధాంశుబింబ
యాశ్రితజనావనాంచద్దయావలంబ
యన్నపూర్ణాకృతివిడంబ యన్నమాంబ. 48

— ఆ స్త్రైంతములు. —

క. ఈదృగ్విధాన్వవాయసు
ధోదన్వచ్చంద్రమునకు సర్వజ్ఞజనసం

మోదకరదానదాక్షి
ణ్యాదిగుణానీకనిధికి సత్ప్రతినిధికిన్. 49

క. లాటయుగంధరకురుక
ర్ణాటద్రవిళాంగవంగనానావనిభృ
త్కోటీరఘటితమణిఘృణి
పేటీభవదంఘ్రినఖునకు బిరుదాంకునకున్. 50

క. శ్రీమంతునకతివినమిత
సామంతునకుఁ బ్రసద్యశశ్చంద్రతది
గ్భీమంతునకరిసరసిజ
హేమంతునకలఘుధైర్యహిమవంతునకున్. 51

క. కరుణారసార్ద్రమతికిన్
జరఠానతవిమతతతికి శౌర్యోన్నతికిం
దరుణార్కసముద్యుతికిన్
ధరణీభృద్ధృతికి బృహస్పతిన్యాకృతికిన్. 52

క. కనదురుదరస్మితయుతా
ననసరసీజునకు భూజనస్తుతలీలా
ఘనభాగ్యబిడౌజునకు న
దినకరతేజునకు సాహితీభోజునకున్. 53

క. రాజదిలీపునకున్ వి
భ్రాజాన్వయకలశసాగరకలాపునకున్
రాజత్కలాపునకును
వ్యాజసుధామధురపేశలాలాపునకున్. 54

క. శాంతరసపాండవాగ్రణి
కంతర్వాణిప్రతానహర్షప్రదకై

రంతరవితరణసరణికిఁ
గాంతాంబాతనయమణికి ఖలగజసృణికిన్. 55

క. శరనిధిగాంభీర్యునకుఁ
సరసౌదార్యునకు మేరుసమధైర్యునకుఁ
స్మరనిభసౌందర్యునకుఁ
నిరుపమశౌర్యునకు రామనృపవర్యునకున్. 56

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నఖిలకకుబంతవిశ్రాంతప్రసి
ద్ధిగా నంకితంబొనర్పంబూనిన యిమ్మహాప్రబంధంబునకుఁ
గథాక్రమం బెట్టిదనిన. 57



## కథాప్రారంభము

మ. అమరేంద్రుం డొకనాఁడు కాల్యకరణీయంబుల్ నివర్తించి
రు, క్మమణీకీలితమండనప్రకరముల్ గై చేసి యాంగీరస
ప్రముఖోదీరితపూర్వపుణ్యపురుషప్రఖ్యాతచర్యాసుధా
ప్తిమహాహ్లాద మిడఁ సుధర్మ నొఱప్పై పేరోలగం బున్నెడన్.

సీ. అమరావతీనగర్యంతరాంతరవినో
దావలోకనజాతహర్షముననో
రంభాప్రభృత్యప్సరఃకామినీపయో
ధరధరారోహణోత్సాహమునో
మాహేంద్రలోకసామ్రాజ్యేందిరాసమా
క్రమణసంసక్తదీక్షాభిరతినో
యైరావణభుజాబలాత్మీయదోస్సార
తారతమ్యజ్ఞానతత్పరతనో

తే. ప్రమద మెసఁగంగ మర్త్యలోకమున నుండి
నిండి రెల్లెడ తండోపతండములుగ
నింద్రపురియందు నిజభుజాహీనచలిత
కలితకరవాలవీరు లాకస్మికముగ. 59

తే. అట్లు చనుదెంచుచున్నశూరాగ్రయాయి
జననికాయంబుఁ గాంచి యాశ్చర్య మొంది
తత్పురీగూఢచరు లతిత్వరత నేగి
మరుదధీశ్వరుఁ గాంచి నమస్కరించి. 60

శా. దేవా దేవర వీటి కెవ్వరొ ధరిత్రీభాగమందుండి తే
జోవైశ్వానరులాజిరంగనరులత్యుగ్రప్రభాభీక్ష్ణబా
హావిక్షేపితశాతహేతిరుచిధారాకృష్టదుష్టాహిత
ఖ్యావర్యేందిరు లేగుదెంచి కనదాశ్చర్యం బవార్యంబుగన్.

సీ. ఉచ్చైశ్శ్రవంబు చుంచొడసి పట్టి చరాల్న
నెగిరి యెక్కుచ్మడి నెక్కువారు
నందనోద్యానమన్దారశాఖలు వంచి
యొఱపుగా నుయ్యేల లూఁగువారు
కామధేనువ నడ్డఁ గట్టి గుమ్ములు గ్రోలి
యాబెయ్య యిది మంచి దనెడివారు
సురసరిత్కనకతామరసమ్ము లుడివోక
తెమలించి బారుగాఁ ద్రెంచువారు

తే. జలవిహారావసరసాహచర్య మమర
నమరకన్యాకపోలస్తనాతిచిత్ర
మకరికాపత్రములహూపు మాపువారు
నగుచు నెల్లెడఁ దారె రైమె రగవిరోధి. 62

చ. తోడఁబడ వచ్చి హెచ్చరికతో మును జన్నము లెన్ని
యేని యే, ర్పడ నొనరించు పుణ్యమున బాంధవ మొం
దిన పారుటయ్యలన్, వెడల నదల్చి యచ్చరల వెన్వెనుక
న్వగగాఁ జరించుచోఁ, బడచుతనంపుటాటల నెపంబున
వారల కయ్యె కయ్యముల్. 63

వ. అని మఱియును బ్రళయసమయసముచితరుచిపిచండిలప్ర
చండ చండ కిరణమండలమండలాయితమాననీయప్రతాప
కలాపధురీణులును నభినందితసౌందర్య రేఖా మోఘీకృత
ప్రసవబాణులును నతినిశితకులిశధారానిరాకరణకారణ
భావిభాసమానబాణబాణాసనకృపాణ పరశుపట్టిసప్రాసము
సలముద్గరప్రముఖనిఖిలసాధనప్రసాధితపాణులును ననన్య
తరచిరంతనోదారహీరమణితనుత్రాణులును నమందానంద
కందళితసుధాబిందు సందోహ ప్రస్యందిమధురవాణులును
మానత్రాణులును నగు వీరపుంగవశ్రేణు లిరుగెలంకులందు
నే పేర రేఁచినతీరునం బరవకట్టి రాసమయంబున. 64

సీ. మగమానికపుతురాసొగసురాఁజెక్కిన
కలువరావన్నెపాగా ధరించి
గంబురామెయిపూఁతడంబురాజనబాబు
ఖండునా వలెవాటుగా ధరించి
చలువరాచెలువురా చవులనిద్దాతరా
కట్టాణి గొప్పచౌకట్లు దాల్చి
జాళువా మొసలివాజముదాడుశత్రుల
గెలువ నోపెడుదానిఁ గేలఁ బూని

తే. వెలుచ నీరేడుజగములు గలయఁ దిరుగ
నరుగుదెంచిన గరుడవాహనునికరణి
నరుణిమలఁ జొక్కు హైమపల్యంకకంబు
నెక్కె యొకదొడ్డదొరబిడ్డ యుక్కు మెఱసె. 65

క. మున్నెన్నఁడు మాదృశు లిట
విన్నది గన్నయది గానివిస్మయ మిది య
న్నన్నా కన్నారంగనుఁ
గొన్నారము తమకుఁ దెలుపు కూరిమికతసన్. 66

చ. అనవుఁడు విస్మయంబును భయంబును సంభ్రమ మొక్క
వ్రేఁకండిం, బెనఁగఁగ నెమ్మనంబునను బేర్కొను చింతల
నెంతయుం బుఱా, తనసహాయసాదికృత్యములు తప్పఁ దలం
పుచు ఖిన్నచిత్తుఁడై, వెనుకయు ముందుఁ దోఁచమిని వృ
త్రవిరోధుడు రాధినుగ్నుఁడై. 67

ఉ. పెచ్చుపెరుంగు నక్కజపుఁ బెంపునఁ గూరు నిలింపభర్తృక
భ్యుచ్చయహేతువై తనదుపూర్వతపఃఫల మిట్లుఁ దోఁచె నా
నెచ్చట నుండి యెచ్చటికి నేగుచునోఁ జనుదెంచెఁ బుణ్యసం
పచ్చరితుండు చుక్క దెగిపడ్డగతిం గలహాశనుం డొగిన్.

సీ. కొమరుగాఁ జుట్టిన కుఱుఁగెంపుజడగుంపు
బాలార్కబింబసంభ్రమమునీన
నిగురుపూఁతమిటారి జిగిఁ బూను తెలిమేను
శరదభ్రవిభ్రమస్ఫురణఁ జూపఁ
జక్కనిపటికంపుజపసరంపుటొయార
మతితపఃఫలసంఖ్య నభినయింప
మువ్వన్నె మెకముతోల్ మవ్వపునడికట్టు

సౌరు శక్రాయుధచ్ఛవినిఁ దెగడ

తే. మహతినారాయణాత్మకమహితమంత్ర
వర్ణములు సారెఁ బల్కుచువన్నెకాఁడు
దురముటోరెంపుదాసరి సరసగతుల
నతులనై ఖరి మెఱయ నిట్లరుగుటయును. 69

ఉ. కప్పురపాటుతో నతనిఁ గన్గొని కన్గొనలందుఁ జాలుగాఁ
జిప్పిలు హర్ష బాష్పములచేఁ బద మార్జన మాచరింపుచుఁ
ముప్పిరిఁగొన్నసంభ్రమసముద్రముముద్రతఁదాల్చి పొంగిరా
నప్పరమోపకారనిధి యంఘ్రులకుం బ్రణమిల్లి యల్లనన్.

వ. అమ్మహామహుం డోడ్డకనివచ్చి నిజాసనార్ధభాగంబున నుని
చి నముచిదమనుండు సముచితప్రకారంబుగా ననిచినకుతూ
హలంబునఁ బునఃపునరభివందనంబుల నతనిడెందంబు
నానందింపం జేసి యప్పురాతనతపస్వియాననారవిందం
బవలోకించి కించిదభ్యంచితపంచమస్వరప్రపంచితవిపంచి
కారవానుకారిభూరిమాధురీధురీణవచనరచనా చమత్కా
రంబు మెఱయ నిట్లనియె. 71

క. నారదమానీశ్వర ని
ష్కారణ మరుదెంచినట్టి కారుణ్యసుధా
ధారానీరాకరమా
నీరాక రమాకరంబు నిక్కము మాకున్. 72

తే. దేవమునివర్య తావకపావనాంఘ్రి
జలజసందర్శనానూనసంభ్రమమున
నభిమతార్థంబు లొడఁగూడె నంతెకాదు
జన్మసాఫల్య మొదవె మజ్జాతికెల్ల. 73

తే. ఆజవంజవమాలిన్య మపనయించు
దురితములనొంచు నుత్తరోత్తరశుభాభి
వృద్ధి సమకూర్చు మీరాక వినుతిసేయ
నింక వేయేల పలుక మునీంద్రతిలక. 74

చ. అని వినయంబు దోఁపఁగ మహర్షిసమాగమనంబు మెచ్చి
హె,చ్చినకుతుకంబుచే నతనిచిత్తము రామధురోపహారము
ల్,మునుపుగ భక్ష్యభోజ్యముఖముఖ్యపదార్థసమాదరార్హ
భో,జనమున గంధిలార్ద్రహరిచందనచర్చలఁ దృప్తిఁజేయు
చున్. 75

మ. కలకాలంబు నహర్నిశంబును భవత్కారుణ్యసంప్రాప్తిచేఁ
గలిగెన్ స్వస్థత మాకు సార్థకముగాఁ గళ్యాణసంధాయకో
జ్జ్వలలీలావిభవంబు లెన్నియొకొ తత్సర్వంబు సంపూర్ణతా
కలనం జెందెనొ కంటనుం గుఱు తెఱుంగన్ రానిభాగ్యో
న్నతిన్. 76

చ. వశిజనవర్య మీకెఱుఁగవచ్చు సమస్తమునైన యీచతు
ర్దశభువనంబులం గల యుదంతము మీరు త్రిలోకవేదులీ
దృశమహిమంబు మీకె తగు దేవరవారి కవేద్య మెద్ది యీ
దిశలఁ జరించు పేరు గల దేవఋషుల్ మిముఁబోల రెవ్వరున్.

చ. అని కొనియాడి యాతపసియాత్మకు నెయ్యము దోఁపఁగా
మహా,వినయముతోడ నిట్టులను విన్నప మొక్కటి యున్న
దిప్డు మా,మనమునఁ గల్గు సందియము మానుప మీరు సమ
ర్థులౌట నొ,య్యన వినుపింతు మీకు నిదె యంజలి నెంజలి
వాపుసంయమీ. 78

వ. అది యెయ్యది యంటేని. 79

చ. ఇపుడొకయక్కజంబు జనియించిన దిప్పుడు దెవ్వరంపుగా
ర్యపుఁ బని మున్నెఱుంగని తెఱంగగు నిట్టిమహాద్భుతంబు మీ
ఱ, నిపుణత దక్కఁగాఁ దెలియనేరము నేరము సైఁపు
మెవ్వరో, విపులపరాక్రమక్రమ నవీనధనంజయు లిందుఁ
గ్రందుగన్. 80

క. చనుదెంచి వీటి నెల్లెడ
ఘనతరదర్పం బఖర్వకలనవహింపం
జనవరు లల్లన విడిసిరి
జనవరు లగువారి తెఱఁగు సాకల్యముగన్. 81

క. వినుపింపు మనుడు నారద
మునిచంద్రుఁడు లేతనగవు మొగమునఁ జిలుకం
దనవాక్సుధారసాప్లుతి
ననిమిషపతిడెంద మలర నల్లన ననియెన్. 82

మ. ధరణీభాగమునం దపూర్వ మగు యుద్ధం బయ్యె భీభత్సరౌ
ద్రరసాలంబనమై మహాద్భుతతమద్రాఘిష్ఠదోశ్శౌర్యభీ
కరమై పర్వుచుఁ బద్మనాయకులకుం క్షత్రాళికిం దప్రణో
ర్వరమేను ల్విడనాడి శూరులు మహేంద్రా వచ్చి రివ్వీటికిన్.

స్రగ్ధర. ఘోరాటోపంబుమీఱన్ గురుతరసమరక్షోణినన్యోన్య
వైర,ప్రారంభోత్పాతజాతప్రబలజయరుషాపాటవం బేపుమీ
ఱన్, బీరంబుల్ చూపికొంచున్ బిరుసనక ధరం బెల్లుగా
వ్రాలు శూరుల్,వీరస్వర్గానుభూతిన్ వెలయుదు రనఁగా వీట
నిక్కంబు దోపన్. 84

వ. ఇత్తెఱంగున ననన్యసామాన్యదార్ఢ్యజన్యం బగు నొక్క
జన్యంబు విస్మయప్రాధాన్యంబై పరంగినకారణంబున నితరే

తరనిశితకరవాలధారానిపాతనంబుల నెదురుగాయంబులం గాయంబులు పదులు జోదులు ధర్మాధర్మప్రకారంబుల ననుకరించి కొంద ఱీయమరావతిని గూర్చియుఁ బరేతపతి నికేతనంబు ననుసరించి కొందఱు ప్రవర్తించి రనవుడు నోడు కలిచి శచీజానియూసంయమిపుంగవుం గనుంగొని యి ట్లనియె. 85

శా. భూలోకంబున నెవ్వ రెవ్వరికి నాపోరాట వాటిల్లె త
చ్ఛీలంబుల్ కులముల్ బలాబలములుఁ సేనాసముజ్జృంభి
తా,భీలాటోపవిడంబనంబులు జయాపేతప్రచారంబుల
య్యాలంపుఁ బరుషత్వముల్ వినుట కయ్యా వేడ్క యూ
నిత్తటిన్. 86

క. యీకథ సాకల్యంబుగ
మా కెఱిఁగింపుము కృపాసమగ్రకటాక్ష
ప్రాకటవచోవినోదో
ద్రేకము దీపింప మౌనిశేఖర యనుడున్. 87

చ. చిఱునగ వాననాబ్జమునఁ జెన్నలరన్ మునిచంద్రుఁ డ
ప్పురం, దరునిమనంబు రంజిల సుధామధురద్రవముద్రితం
బులన్, నిరుపమగోస్తనీస్తబకనిస్సృతచారుమరందపూర
భా, స్వరములు నైన పల్కు లతిసమ్మదలీలఁ దలిర్ప నిట్లనున్. 88

చ. కలవు ధరిత్రియందు సరకారు లనేకములందులోఁ ద్రికా
కుళము కళింగసంజ్ఞత మకుంఠతఁ బేర్కొను నందుఁ గల్గు
బా, బ్బిలి యను నొక్కపట్టణ మభీష్టత మప్రతిభానుభావ

మం, జుల మగుచుఁ ధరారమణిసౌమ్ములపెట్టెయ నామ
హోన్నతిన్. 89

ఉ. నీలమణిప్రరోహరమణీయశిఖాపరిచుంబితాంబరో
త్తాలవిశాలసాలకలితద్యుతిరూపితదిక్తటంబు కే
ళీలసదాపవన్యలవలీసుమనిర్గళదానవాంబుధా
రాలలితంబు బొబ్బిలిపురం బెసఁగుఁ సుజనాభినంద్యమై.

ఉ. ఆపురిసాల మాకసము నాఁగ నభోగతి తా గమింపఁగా
నోపకఁ గాదె యవ్వలికి నూకువతోడుతఁ జొకళింపఁ గా
నోపు నటంచు నెంచి జనితోత్సుకుఁడై తురగంబుగాఁ
గొనెఁ, జాపలయుక్తమా హరిణశాబకముఁ హరి యా
త్మ మెచ్చుచున్. 91

మ. జితవారాన్నిధి యైన వీటిపరిఘం బెన్నొందు వాఃపూర మ
ద్భుతలీలఁ భుజగాధినాయకపురంబుల్ జొచ్చె నందుఁ జల
ప్లుతిబాతాళతలం బొకింతయును నంభోవ్యాప్తి గాకుంట
జు, మృతలంబుఁ వితలంబు నన్నయభిధల్ ప్రాపించుటల్
వానికిన్. 92

ఉ. వ్రాలిన యాఖనీలిమకరంబు నజాండముఁ బ్రాకి యొప్పు న
ప్పోలి యనూనమానములఁ బొల్పగు మేడలఁ బెట్టినట్టి
యా, నీలపుటోడుబిళ్లల జనించిన నైల్యము జుమ్ము గాని
చో, మే లగునే యరూప మగు మిన్నునకుఁ గుణయుక్తి
జెప్పుటల్. 93

మ. విలసద్వాతవిధూతకేతనసముద్విగ్నస్ఫురద్ఘంటికాం
చలరావంబులు రేయునుం బగలు హెచ్చై దాపునఁ
మ్రోయఁగా, నలరూదఁ గను మూయలేమిని గదా

యస్వప్ననామంబు వే, ల్పులకున్ గల్గుట వీటిసౌధముల
పెంపుల్ జెప్పఁగా నేటికిన్. 94

క. అన్నగరి నున్న సంపఁగి
క్రొన్ననల నమర్త్యనీలకుంతల లుత్సా
హోన్నతిఁ దాల్తురు తురుముల
నెన్నంగను బైడితేకు లివియో యనఁగన్. 95

ఉ. ఱెక్కలు లేని యండజవరేణ్యము లుజ్జ్వలరూపసంపదన్
మిక్కిలి విఱ్ఱవీఁగెడు సమీరణముల్ జనలోచనోత్సవం
బెక్కుఁగఁ జేయు చిత్తను లమేయసుధానిధి ద్వైస చంద్రుపే
రక్కునఁ జొక్కుచుండెడి కురంగము లప్పురిలో తురంగ
ముల్. 96

క. వేదండము లప్పురి శుం
డాదండము లెత్తి వంచుటలు దిగిభములన్
వాదునకే పిలుపుగదా
కాదే నినవెత్తి వంపఁగా నేమిటికిన్. 97

ఉ. కంటికి గూర్కు గాన రొకకాలమునందును గూటి యాస
నిం, టింటికి సత్రముల్ వెదకు హీనత కోడరు పాకవైరి
తో, జంట దొరంగ రద్దివిజసంతతు లెంతటివార లంచున
న్నింటను సౌఖ్యము ల్గను మహీసురు లొప్పరు వేల్పులం
బురిన్. 98

మ. అరివర్గంబుల నొంచుపట్టు నరణాహంకారదోశ్శౌర్యబం
ధురులై ధర్మసహాయవర్తనల నెందున్ దక్కు రాకుండఁ
గ్రు, మ్మరుచున్ రాజకుమారసంజ్ఞితము సన్మానింపఁగా

నుందుర, ప్పురిలో రాజకుమారు లాహవజయస్ఫూర్జత్ప్ర
తాపోన్నతిన్. 99

మ. నవతం బూను నిధానముల్ గలుగు నంతర్గర్వ సంపత్తినై
భవ మందేఁ దనగుహ్యకేశవిదితప్రఖ్యాతిఁ గానందు నై
శ్రవణుం డంచుఁ గుబేరు నెంచరు మహాసంపూర్ణసంపత్క
ళా, వివిధైశ్వర్యనిధుల్ కిరాటు లెలమిఁ వీటఁ నిరా
ఘాటతన్. 100

సీ. ఒకక్రౌంచమును గెల్చి యుబ్బి తబ్బిబ్బైన
షాణ్మాతురుని పౌరుషంబు ఘనమె
ఒకయంధకుని ద్రుంచి యుగ్రతఁ గైకొన్న
పశుపతివిక్రమప్రౌఢి యరుదె
ఒకవీరుఁ గెల్వ నోపక వీఁగిపాఱిన
హరిదశ్వమగటిమి యబ్బురంబె
ఒకసైంధవోద్రేక ముడిపి పెల్లు నటించు
పార్థుని యాటోపపటిమ యరుదె
తే. యనుచు నభినవవిక్రమార్కావతార
సారదోస్సారనిస్సారితారివీర
వారదుర్వారగర్వాంధకారగిరులు
వెలమదొర లొప్పుచుందు రవ్వీటియందు. 101

ఆ. అంటి పొడిచి పోటుగంటు వెంబడి దూరు
వీరవరులు పురుషకారపరులు
మేరమీఱు సంఖ్య మెఱయుదు రవ్వీట
నదురుగుండె పిక్కచెదురులేక. 102

మ. ఒకయెద్దేఱుగలంతనే వృషలుఁడై యుద్యద్విభూతిఁ మహా
ధికుఁడై భిక్షుఁడు రాజశేఖరుఁ డనాఁ దీండ్రించు సంపత్తిమా
మకనామాంకము లూఁది కాంచె నిల సన్మద్వృత్తు లెవ్వారి
నుత్సుకతన్ రాజులఁ జేయ వంచుఁ బురిలో సొంపొందు
చుం ద్రంఘ్రిజుల్. 103

మ. హరిణీసంవ్యూతఁ జూడ్కి చేత శశిరేఖాస్మాదమాస్యంబునన్
మఱిరంభాతిశయంబు పెందొడల హేమాభ్యంచితాసుగ్భాగ్భ
భా,స్వామా మేనఁ దిలోత్తమాధికతనాసాఫృష్టిచే గెల్వన
చ్చాలం గెల్చుట కెంతవింత పురవేశ్యాకామినీజాతికిన్. 104

చ. ఉపవనమండలంబులు మహోన్నతులున్ సరసీవ్రజంబు తో
రఘుసొబగున్ బురీనికటరాజితశాలివనీసమగ్రతల్
విపులతరావణప్రకరవిస్తృతనిస్తులవస్తుజాలముల్
నిపుణతఁ గాంచు సత్కవుల నేర్పునఁగాని నుతింపఁ బోలునే.

వ. మఱియు నతివిమలనీరంధ్రప్రఫుల్లహల్లకకల్హారపరిమళమిళిత మధురమధురసాసారంబు లగు కాసారంబులవలనను గుసుమితలతాప్రతానవేష్టితనానానోకహవితానబంధురగంధప్రలుబ్ధవిభ్రమద్భ్రమరసంతానంబు లగు నుద్యానంబులవలనను హరిహయాయుధప్రస్థరస్థగితహర్మ్యనిర్మలప్రభాపటలప్రణుతరాకానిశాకరకళంకంబు లగు విటంకంబులవలనను సభ్రంలిహాదభ్ర సౌధాగ్రతల పరిభ్రమ త్పౌరపురంధ్రీ కచప్రచయ పయోధరావలోకన ప్రభూత కుతూహల చటుల నయనాపరాయణ పోషిత మయూరవర్గంబు లగు రాజమార్గంబులవలనను సనర్ఘ్యతరచిరంతనరత్నఘంటికాఘణఘణాత్కార ఘీంకారసంకులారవనిరంకుశాకుంచన

ప్రసారణోద్దండశుండాదండంబు లగు వేదండంబులవలనను దుములతమలడమామికాతమ్మటపటహఢక్కాహుడుక్కాప్రముఖభేరికా నినాదమేదురదురాసదప్రాంగణసుందరంబు లగు తత్తత్ప్రభుమందిరంబులవలనను నిజభుజాగ్రజాగ్రత్ఖండలాగ్రధారానిరాఘాట విజయధాటీసముద్భటు లగు వీరభటులవలనను నమూల్యకల్యాణపల్యాణకలితవిలయపవమానజవమాన బాహ్లీక పారసీకారట్టఘోట్టాణసమారోహణోద్వృత్తు లగు రాహుత్తులవలనను నప్రస్థలస్థాపితాపరిమితశతఘ్నికానికాయంబుసొంపునం బొంపిరివోని పెంపుమిగిలి సుధర్మాభిరామంబై యమరావతి ననుకరింపుచుఁ బుణ్యజనేశ్వరవిరాజితంబై యలకాపురంబు తెఱంగున గరంబు రంజిల్లు నప్పురంబున కధీశ్వరుండు. 106

ఉ. రావుకులాభిమానిబుధరంజనధర్మగుణప్రధాని నా
నావసుధాధినాయకగణస్తవనీయయశోనిధాని శౌ
ర్యావసథాయమానవివిధార్భటిమద్వరసేని రంగరా
యావనిజాని పొల్పెసగు నాహవరంగజితారిమానియై. 107

వ. ఏతదీయవంశానుక్రమం బభివర్ణించెద. 103

చ. పరమపవిత్రయై భువనపావనిజాహ్నవి గల్గెనే మహా
పురుషునిపాదపద్మమునఁ బుణ్యతమం బగుతత్స్మరద్విష
చ్చరణసరోరుహంబుననె సంభవ మందినకారణంబుచే
నరయఁగఁ బద్మనాయకులు నావెలమ ల్నుతిఁ గాంచి రిమ్మ
హిన్. 109

క. ఆవెలమవంశములలో
రావుకులీనులు ప్రసిద్ధరమ్యయశశ్శ్రీ)

లావణ్యామూర్తు లగుచు ధ
రావలయం బేలుచుం[డ్రు] రాజన్నీతిన్. 110

శా. శ్రీనాథాంఘ్రిసరోరుహా దయముచేఁ జెన్నొందుచుం బౌ
రుషా,ధీనస్వచ్ఛతరస్వభావనకులై దీపింపుచున్నట్టి య
పాన్నా కాలయపద్మనాయకులకుం మాన్యాదిపీఠస్థులై
శ్రీనిర్వాహకులై రి వేంకటగిరిశ్రీరావురాజాగ్రణుల్. 111

సీ. అనపోతవిభుఁడు మహాపరాక్రమశాలి
గావునఁ దనశౌర్యకలనఁ జేసి
యాజిరంగమునను రాజుల నోడించి
కృష్ణానదివఱకు గెలిచి దేశ
మును దనకు నధీనముగఁ జేసికొనియె నిం
కొకపరిఁ బొసఁగిన యుద్ధమునను
దనమీఁద వచ్చినఘను లగుదొరలను
నూటిపై నొక్కని గీటడంచి

తే. యేకవీరుం డటంచును నెన్నికఁ గనె
వేంకటగిరికుటుంబపుఁ బృథివిపతుల
లోన నారవపురుషుఁ డామానఘనుఁడు
వెలమలకు నెల్లఁ గలిగించె విమలకీర్తి. 112

సీ. సర్వజ్ఞసింగయ జనపతి యెల్లవి
ద్యల నేర్చి తనపేరు సార్థకముగఁ
బండితకోటిచేఁ బలుకవీంద్రులచేతఁ
బరివేష్టితుం డయి పౌఢి మెఱయ
విద్యావినోదియై హృద్య మైనరసార్ణ
వసుధాకరం బనఁబరగు గ్రంథ

ము రచించె సంస్కృతమునఁ బండితుం డని
కవివరుం డనియును గాంచెఁ గీర్తి
తే. నతఁడు వేంకటగిరివంశమందు నుదయ
మందిన వసుంధరావరులందు దశమ
పూరుషుం డయి జను లెన్నఁ బేరు వడసె
దగదె యాతనివర్ణింప జగతియందు. 113

క. అల వేంకటగిరిపురరా
జులలోఁ బదునేనవపూరుషుం డగుచు మహిం
బాలించెఁ బెదరాయఁ డాతఁడె
వెలసెను నిర్వాణరాయవిభుఁ డనుపేరన్. 114

సీ. మొగలాయిప్రభులకై పూని షేస్తహాముదు
ఖానుఁ డనెడుపేరు గల్గినట్టి
సరదారుఁడు మనదేశమును జయింపఁగ
వచ్చె నాతనితోడ వచ్చినట్టి
యిరువురుప్రభులలో నీతఁ డొక్కరుఁ డయి
యుండెఁ దత్కాలఘుయుద్ధములను
బలుసాయ మొనరించి పాదుషావలన రా
జామనునట్టి సంస్థానము బ్రతి
తే. ఫలముగను నొందె రెండవప్రభువు విజయ
నగరరాజ్యము మొదటివాఁడుగ గణింపఁ
బడిన మాధవవర్మ యనఁబుడమిఱేఁడు
వీరిలో బెద్దరాయపృథ్వీవరునకు. 115

సీ. సంస్థానము నొసంగు సమయంబునందె వం
శక్రమంబుగను రాజాబహాదరు

మొదలైన బిరుదులు ముఖ్యమౌ తెల్లజెం
డా నవుబత్తును ఢక్కయాది
గలిగిన రాజచిహ్నములొసంగఁబడె నుత్త
రపుసరకారులం దపుడు పోరి
సందడి యడఁగ దాజనపతి కూడవ
చ్చినయట్టి లింగప్ప యనుసుతునకుఁ
తే. దనకు సమకొన్న యారాజ్యమును నొసంగి
తండ్రితాతలనాటిదై తనరు వేంక
టగిరి రాజ్యమ్మునకును దిరుగ జనియెను
బెద్దరాయ వసుంధరావిభువరుండు. 116
శా. శ్రీమల్లింగపరాయమానవపతి శ్రేష్ఠుండు సర్వప్రజా, క్షేమా
పాదకరాజ్యరక్షణ పరస్వీయాంతరంగాఢ్యుఁడై, రాముం
బోలుచుఁ దండ్రిగారివెనుకన్ రాజ్యంబు పాలించె ది,గ్భా
మాకాయదుకూలతా విభవశుంభత్కీర్తిసంపన్నుఁడై.
చ. అపుడు శ్రీగాకుళాఖ్యపురమందు వసించు నబాబు గారు త
ద్విపులపరాక్రమాతిశయ విశ్రుతలింగపరాయనాముఁడౌ
నృపమణిరంగవాకను వనీస్థలికి స్వగృహాగ్ర మేగి వ
స్త్రపటలబద్ధు నాత్మసుతు దోర్విభవంబున వారిఁ గొట్టి తే
నపరిమితప్రమోదభరితాంతరుఁడై కడుసన్నుతింపుచున్.
శా. గారామొప్పఁగ నప్పు డీతనిని రాఘూటప్రతాపాఢ్యతా
ధీరత్వాదిగుణప్రపంచము నిజాం ధగ్గోచరం బౌనటుల్
దారాగంబున వ్రాయఁజూచియతఁ డుత్సాహంబుచే నిచ్చెరం
గా రావన్ ఘనపౌరుషాఖ్యఁ గులజస్త్ర పాలచిహ్నంబుగన్.
ఉ. అంతియెకాక యొక్కనిశనాయసగ్రామము లెన్నితోరణా

క్రాంతి వహింపఁ జేయునవి గౌరవ మొప్పఁగ శాశ్వతంబుగా
సంతస మొప్ప నాతనికిఁ జయ్యన నిచ్చెఁ దదీయపౌరుషం
బంతయునిత్యమైజగములందు వెలుంగఁగఁ జేయునూహచేన్.

శా. ఆరాజన్యుఁ డపుత్రకుం డగుటచే నాత్మీయవంశోదయుర్
ధీరుర్ వెంగళరంగరాయనృపతిర్ దీనావనోదారునిర్
గారా మొప్పఁగ దత్తపుత్రకునిగాఁ గైకొంట నాధీరుఁడే
యారాజాగ్రణి వెన్కఁ బూజ్యగతి రాజ్యంబేలె నత్యున్నతిన్.

శా. శ్రీమద్వెంగళరంగరాయవసుధాసీమంతినీశుండు సు
త్రామప్రోజ్వలభూరిభోగవిభవభ్రాజిష్ణుఁ డౌచుం గృపా
భూమాన్వితమనోంబుజాతుఁడయి సద్భూమీసురవ్రాతముర్
గ్రామాదిప్రదుఁడౌచు మోదయుతమర్ గాఁ జేసె సంప్రీతి [చేర్.

క. రంగపతి రంగరాయనృ
పుంగవుఁ డొకఁ డతనిసుతుఁడు భూరితరశ్రీ
రంగపతి భక్తపరుఁడై
మంగళగతిఁ దంత్రకరణి మహిఁ బాలించెన్. 123

క. కాయజతులితాకృతియుర్
ధీయుక్తవిశేషవిజితధిషణోన్నతియుర్
రాయఁ డపరంగరాయా
ఖ్యాయుతు నొకసుతు నతండు గనె సుకృతమునన్. 124

క. ఆఘనుఁడు విష్ణుపదకల
నాఘటితనిజాత్ముఁ డగుచు నైజవసుశ్రీ
మోఘితకవిదారిద్ర్యని
దాఘోన్నతి యగుచుఁ జిరము ధరఁ బాలించెన్. 125

క. ఆపార్థివుఁ డనుతుండై

భూపాలననిపుణుఁ డైన పూర్వోక్తశ్రీ
గోపాలకృష్ణరంగ
త్క్ష్మాపాలకు దత్తపుత్త్రుఁ గా జేసికొనెన్. 126
తే. క్షితితలంబున గోపాలకృష్ణరంగ
రా వటంచును మఱి రంగరా వటంచు
నామముల రెంటిచేత నాభూమినాయ
కాగ్రగణ్యుండు మిగులఁ బ్రఖ్యాతిఁ గాంచె. 127
క. అతఁ డినుఁ డయ్యును గువలయ
హితుఁ డగుచున్ రాజనామ మొసఁగియుఁ బ
దృతి యగుచుఁ దాను ఘనుఁ డై
క్షితి మెలఁగుచుఁ జిత్రరీతిఁ జెలఁగుచు మఱియున్. 128
సీ. తనభుజాదండాసి ధారామహోరాహు
వరిరాజతతులు వెన్నంటి స్రుంగఁ
దనసముద్దీప్తప్రతాపసహస్రాంశుఁ
డహితాంధతమసముల్ గుహలఁ జొనుపఁ
దనసత్కుముదబాంధవుఁడు శాత్రవలోక
ముఖపంకజముల సొంపులు హరింపఁ
దనదృఢాజ్ఞావేల మొనసి ప్రత్యర్థిభూ
పతిసముద్రంబులఁ బట్టువఱప
తే. నహుష నల రంతి సగర మాంధాతృ పూరు
పృథు భగీరథ శశిబిందు విక్రమార్క
ధర్మతనయుల మఱపించి ధరణి నేలె
రమ్యగుణజాలముల ప్రోవు రంగరావు. 129
తే. మన్నెహంవీరపెరమన్నె మదవిభాళ

గాయగోవాళబిరుదవిఖ్యాతిధనున
కమ్మహీజాని కనుజన్ముఁ డై తనర్చె
రావుకులహేళి వెంగలరాయమౌళి. 130

క. ఇంద్రోపేంద్రులకై వడిఁ
జంద్రార్కులపగిది రామచంద్ర సుమిత్రా
చంద్ర ముఖిజులత్రయ ని
స్తంద్రత వెలయంగ నం దుదారశ్రీడన్. 131

తే. అగ్రజుం డైనరంగరాయావనీంద్ర
చంద్రమునిసాహసౌదార్యసద్గుణములు
వినయధర్మప్రజానుపాలనవిధములు
స్పష్టలగువారి దెలుప నప్రియముదోఁచె. 132

సీ. ఆమన్నెకొమరుని యభినవసౌందర్య
వీరప్రతాప సద్వృత్తి యరసి
యాపట్టనాయక క్ష్మాపాలతిలకుని
ప్రకటితసర్వాంగపటిమ నరసి
యానెల్లదొరబిడ్డ యప్రతీపవిచార
పంచాంగనిర్ణయప్రౌఢి యరసి
యారావువంశపయఃపయోధిసుధాంశు
చతురుపాయజ్ఞానసరణి నరసి

తే. చాల దనలోనఁ జూపోపఁజాల కునికి
నిర్నిమిత్తవిరోధంబు నెఱయ మెఱయ
రయసముద్విగ్నరోషాగ్ని రవులుకొనుచు
డెందమగలింపదుర్వ్యథామందుఁ డగుచు. 133

తే. రావుకులజన్ముఁ డగురంగరావుపేరి

గొప్పమగమానికపుఁబూస యొప్పిదమున
శాశ్వసామ్రాజ్యవైభవం బక్కటకట
వెదకికొన గాజుపూసపాటిది యటంచు. 134

తే. భాగ్యసంపన్నుఁ డగు పూసపాటివిజయ
రామరా జను నొకదొడ్డరాచబిడ్డ
యనుదినంబును రంగరాయక్షితీంద్రు
పెంపుమది నించుకేని సైరింపలేక. 135

వ. ఇట్లున్నంత. 136

సీ. గుఱిదప్ప కొకట నేగుర నాగ్గురను నొంపఁ
గలయలగోల్పాకులబలంబు
కోట్లల నడఁచి గగ్గోలుగాఁ బడఁద్రొక్కు
వేబారుటేటిల వెలమగుంపు
ఱెక్కమొసల్ గాచి ఱెక్కసైచిన డాగి
తెఱఫులు వఱపెడు సేనపౌఁజు
నాఁటి కొక్కఁడె చాలి మేటిమగంటుమిఁ
గాలుద్రవ్వుచు నుండు కాలిమూఁక

తే. యట్టిఱా వీని కెద్దరా నుద్దయైన
జోదువివ్వత్తుఁ డొకఁడేమొ చూడ ననుచు
నివ్వెఱఁగుఁ గాంచి సైనెత్తి చివ్వకెదుర
నోప నేరని కడిమిన్నై యుండునంత. 137

శా. ఢిల్లీపాదుషహానియోగమున రూఫ్ఖ్ రాజరాజే నిజా
మల్లీపేరటి మేటిసాహెబు సుబాయాత్వం గళింగంబు రా
జల్లీలఖ్ ఘనుఁ డాఫరాసునకు మూసాబూసి యన్వాని క

త్యుల్లాసంబున నాధిపత్య మొసఁగఁ యోజించి రావింపు
చున్. 138

ఉ. భాస్కరసన్నిభుం బయిన భవ్యతరస్ఫురణాభినంద్యవ
ర్చస్కతగల్గు నీకు నతిసాహసశీలునకుం గళింగస
న్నిస్కరు భార మిచ్చి శుభలక్షణలక్షితుఁ జేసిపుత్త్ర శ్రే
యస్కర మిట్టికార్య మని యాదరపూర్వముగా వచింపు
చున్. 139

వ. అప్పు డప్పురాసుల జేనికి నుత్తుంగతురంగమాతంగంబులు
మొదలుగాఁ గొన్ని యుపాయనంబులు నుద్ధతులముల్కగ
జఫరజంగుసిఫహాసరదారుగా రనిమెడి దొడ్డకితాబులు నొ
సంగి యతనికిం దగిన సంగడిగా హైదరుజం గనిమెడు
యవనపుంగవుం బ్రధానత్వంబునకుం గుదురుకొల్పి మఱి
యును. 140

మ. తరవుల్ పాలన సేయుచుండు నెడలం ధర్మప్రకారంబు సుం
దరమై పర్వఁగ నచ్చటచ్చటిజమీందారుల్ దివాణాసకో
ప్పరులై గ్రమ్మర సీమలెల్ల ఖరదాబాదాను గావింపుచుఁ
సరకారర్థము దస్తు సేయుఁడు ఖజానా నింపుఁ డింపొంద
గన్. 141

మ. అని రాజ్యప్రతిపాలనానుగుణవాక్యంబుల్ నిజామల్లినాఁ
జను సర్వాధిపుఁ డానతిచ్చుటయు మూసాబూడి వల్లే
యటం, చును దా హైదరజంగుతోఁ జనఁ జమూస్తోమం
బుతోఁ బైన మ, య్యేను లెక్కింపఁగ రానిరాజసము
పెంపెక్కం గళింగానకున్. 142

వ. తత్కాలంబున. 143

సీ. దిగ్గజంబులనైన దివులు గొల్పెడు బృంహి
తధ్వనుల్ నెఱపు దంతావళములు
వాసవాశ్వమునైన వడిఁ జూపి లంఘించి
తోఁకఁ ద్రొక్కఁగ జాలు తురగతతులు
మంథానగిరినైన మాయున్నతముతీరు
గలదె నీకను శతాంగములగములు
సేనానినైన నాసీరమ్మున నెదిర్చి
తప్పులు వెదకు పదాతిచయము
తే. ఘనతరోల్కానికాయముల్ గ్రక్కఁ దివురుఁ
బారు దీర్పఁగ నగునరాబాణలంగు
మందుశకడాలుగుంటె నామానుబంబు
చెకుముకి తుపాకి సాబాకౌతుకము నెఱప. 144
సీ. సాహసోద్ధతమూర్తి జంగ్ర్యహమ్మదు
హుస్సేన్యయూరనా నొప్పు నతఁడు
మోహితీకృతారిలాడూఖాన్కమందమత్
పటుతరాభిఖ్యఁ గన్పట్టు నతఁడు
బహుయుద్ధములఁ బేరువడ్డ విక్రమశాలి
సిద్దిబిలాలునాఁ జెలఁగు నతఁడు
శూరాగ్రయాయియా జోదుజానూఖాను
మిర్జా యనెడిపేర మెలఁగు నతఁడు
తే. మఱియు హాసనల్లిఖానుఁ డన్మానధనుఁడు
మొదలుగాఁ గల్గుసరదారు లెదుట నిల్చి
వేలకొలఁదుల జీరాగుఱాలతోడ
నిరుగెలంకులఁ దనుఁ గొల్వ నేపు మిగిలి. 145

శా. మూసాశబ్దము పూర్వమందు మెలఁగన్ ముఖ్యుల్ సజాతీయులౌ, లానూమ ర్తైనదొ మ్మితీరువిపులాంలస్సేనుకుప్లాంకువే, మాసూనాములు వానిఁ జేరి రతిదుర్తానుల్ జిరాకూర్పు మి, న్నానన్నంపు బనాతుపింజరుల సొన్నా పాలకీ లెక్కుచున్. 146

మ. సమరోజ్జృంభితశౌర్యధుర్యు లగు సాహింతుల్ మయూరాదుల్ కుమంఁదముల న్వీరులు సోలుదారులు సుబేదారుల్ మొదల్లులు సైన్యము లాష్ట్రీయులు గొల్వ నుద్ధతుల ముల్కాఖ్యామహాఖ్యాతిమ, త్సముదగ్రప్రతిభావిభాసి యగు మూసాబూసి యుల్లాసిల్లె. 147

వ. వెండియుం బ్రచండదోఃపాండిత్యంబునం జూఱుకుగల షుకురుల్లాప్రభృతిఖానువర్గంబులును ఛత్రపతిరామచందురుప్రముఖు లగు రజపుత్రులును నాగోజీరాయపురోగము లగు పండితప్రకరంబులును సమరసన్నాహదోహళంబు లగు కాహళంబులును గర్జాసమూర్జితవిరావంబునకుం దానకంబు లగునానకంబులును దూరీకృతశీతవాతోష్ణవృష్టిప్రచారంబు లగుపటకుటీరంబులును భారవహనక్రమవిక్రమంబు లగుక్రమేళకంబులును నీలపీతారుణవిభావడంబరాంబరతల చుంబిత పటపటత్కృతిచంచల నిజాంచలప్రభూత నూతన వాతనిర్ధూతజలభృజ్జడంబు లగుసిడంబులును సమస్తవస్తుసంభారభరణధురీణంబు లగు నాపణంబులును దక్కంగల సామగ్రియుం దనడెందంబున కమందానందంబు సంధింప గందళితహృదయారవిందుండై ఫరంగులదొర కళింగస

స్కారుభరంబుఁ బూని షహరు వెడలి కతిపయప్రయాణం
బులం జనిచని. 148

ఉ. రాజమహేంద్రపట్టణ విరాజదదూరతలంబునన్ సము
త్తేజిత మైన గౌతమనదీతటసీమను గోటిలింగవి
భ్రాజిత మైన యొక్కనవపాదపమంజుల నిష్కుటస్థలిన్
రాజితలీలఁ జేరి శిబిరంబువడిన్ విడియించె వేడుకన్. 149

సీ. అచటిలేమావిమోకాకుఖాణాదిను
పులుగులరొదలు విందులు ఘటింప
నచటిపుష్పాడితిన్నె యలరారు క్రొవ్విరి
తేనెవాకలరాక దేటలీన
నచటియేడాకులనంటిచెట్టులఁ బుట్టు
కపురంపుజిదురుపల్ గన్నుఁ దనుప
నచటియేటికరల్లి నలరు డమ్మలమీాటి
కమ్మతెమ్మెరతావి ఘుమ్ము రనఁగ

తే. మంచిచెంగావిమేల్కారకమాల్కనాతు
కట్టుసాగ సుట్టివడఁ దీర్చి కట్టెసట్టి
రాంకవ మైనయొకగుడారంబులోన
సిఫహసరదారుగారు వసించి యుండి. 150

ఉ. కారుణికత్వ మేర్పడ శ్రీకాకుళపుంసరకారులో జమీా
దారుల రామరాజవసుధావలయేశ్వరముఖ్యుల స్మదం
బారఁగఁ బిల్వఁ బంపు మని హైదరజంగును కానతీయఁ ద
చ్చారవచస్క్రమంబునకు సత్వరుఁడై పిలిపించె వారలన్.

ఉ. పాయనివేడ్క విద్విషదపాయకరాయతబాహుశౌర్యులౌ
పాయకరాయఁడున్ గిమిడిపట్టణపుం బృథివీశ్వరుండు నా

రాయణ దేవుఁడుఁ సరసరాజు మఱింగొలుగొండమన్నెపుం
రాయఁడు నాదిగాఁ గలధరావరు లందఱు వచ్చి రత్తఱిన్.

తే. ఉద్ధతులముల్కు సందర్శనోత్సుకత్వ
మాత్మఁ జిట్టుఁడ నాడాడ నలరు మన్నె
దొరలు వచ్చి రమానుషదోఃప్రసంగ
కలితుఁ డగు రంగరాయఁ డొక్కరుఁడె దక్క. 153

సీ. నిజభుజాదండనిర్ణిద్రకోదండంబు
గాండీవిగాఢ్యుక్రమముఁ జూపఁ
జరమభాగస్ఫురచ్చటులతూణీరముల్
గవదోనసాంపు సంఘటిలఁ జేయ
నాసీరముఖరనానాశాంఖికధ్వనుల్
దేవదత్తారవోద్వృత్తిఁ దెలుప
సూరెలఁ బఱతెంచుజులమతీ తేజీలు
ధవళాశ్వములమస్తు ద్రస్తరింపఁ
తే. గలియుగార్జునుఁ డౌర యీఘనుఁ డటంచుఁ
దనుజగర్జన మెన్న నుద్ధతులముల్కు
వీక్షణాపేక్ష నేతెంచె విజయరామ
రాజరాజన్యలోకమార్తాండమూర్తి. 154

వ. ఇట్లరుగుదెంచునవసరంబున. 155

సీ. సౌవర్ణకలశముల్ సవరించినవిలాతి
సకలాతిహౌదాలసామజములు
జిలుగుచీనాపట్టుచెంగావిచెఱఁగుల
నిద్దాజరీనిశానీలకరులు

గడలికర్ల్లచప్పుడుల నారడిసేయు
గొప్పునగారాల కుంజరములు
నజగరప్రతిమంబు లగు కంచుషుతురునా
ళములు బన్నిన ఘోరాసమదగజము

తే. లన్నియున్నియు ననరాక చెన్నుమిగిలి
తెగలుగా గొల్వవచ్చి యొంతేనివేడ్క
మానితము లయ్యె నారాచతేని కెదుట
సంతకంతకుఁ గనుదోయి కబ్బురముగ. 156

తే. అప్జినఖ్యాతిరాము నౌర్యాతిశయము
రాజభోగంబు మెఱయ నారాజపాలి
విశ్వవిఖ్యాతిఁ గాంచెను విజయరామ
రాజనామంబు తనకు సార్థతవహింప. 157

సీ. చక్కనిసన్నంపుజరబాబుగవిసెనల్
జాలఁ జొప్పడు జెజాయీలబారు
మందుఘుట్టనలవలందు బాజునయించి
చాలు దీర్చిన ఫిరంగీలదారు
ధన్నాసరీవజాతాస్త్రముసుంగుల
నోలి గన్పడు రేకలాలబారు
జానకీ త్రాస్లకృశానుకీలలఁ జేర్చి
కేల నూఁదిన తుపాకీలబారు

తే. మేర మీఱినకొలఁది సమిద్ధలీలఁ
బూనపాట్యన్వయాబ్ధిరాకాసుధాంశు
మోౌలిఁ జూపట్టెఁ జూడ్కి కమూల్యమైన
నిబిడతరనిర్భరానందనియతిఁ దెలిపి. 158

శా. వాజాలూడ్చి ఖలీనవల్గనకశాఘాతోరుసంజ్ఞాదులం
దేజీలన్ దుమికింపుచున్ గరములన్ ధీరుల్ గమానుల్వాగం
బాంజుల్ గట్టి సహస్రసంఖ్యలు శిలేబక్కగ్గతో వచ్చి రా
రాజన్యోత్తముచిత్త మొప్ప మిగులన్ రాహుత్తు లత్యు
న్నతిన్. 159

సీ. పాలుపొందఁ గాకర్లపూడి జగన్నాథ
రాజుగా రొకకొంతఫౌజుతోడ
సత్యవరపుపురస్వామియగా నలరామ
భద్రరా జొకకొంతబలముతోడ
ఘనయశోనిధిము౯ కాశీపతిక్షమా
ధవమౌళి యొకకొంతదళముతోడ
సంఘువిప్రుఁడు చింతలపాటినీలాద్రి
రాజుగా రొకకొంతఫౌజుతోడ

తే. విజయరామరాజక్షమావిభునిమ్రోల
నేత్రపర్వం బొనర్చిరి నిజభుజాభు
జంగరసనాయమానప్రచండనిశిత
మండలాగ్రప్రభావళుల్ మెండుకొనఁగ. 160

శా. శ్రీరంజిల్లు కడాని పైడిజలతారీమాహురీ కెంపుటం
బారీ యేనుఁగు నెక్కి పెక్కులు మదేభంబుల్ దనున్ గొల్చి
రాఁ,గా మార్గన్ జతురంగసైన్యములతో గర్జిల్లుచున్ వత్స
వా,యీరాయప్రభుమౌళి వచ్చెఁ గడు రా జీక్షించి హర్షం
పఁగన్. 161

మ. జగ మొక్కుమ్మడిఁ గ్రమ్మఁ జాలెడు మహాసత్త్వంబుచే నొప్పు
గొ,ప్పగు జాలాత్రితులు నైతలొట్టియలు శోభాస్ఫూర్తిఁ

దన్నాల్పమా, దుగులింగావనిభర్తృరాజమణి సంతోషిల్లఁగా
వచ్చెనో, కల్గఁగజోత్తంసము నెక్కఁ జొక్కమగు సుత్కం
ఠాతిరేకమ్మునన్. 162

శా. ధన్యాటోపులు మందపాటికులరత్నంబుల్ మహారాజమూ
ర్ధన్యుల్ శ్రీరఘునాథరాజబలభద్రేంద్రవరుల్ మున్న సౌ
జన్యప్రౌఢలఁ బాఱుదెంచి శిబికాచంచత్తురంగాళి రా, జన్య
గ్రామణి వచ్చి రుత్సవముఁ దత్స్వాంతంబు సొంతంబుగన్.

చ. పలుపది వేలకాల్బలము నాలుగు వేలతురంగమంబులున్
బలువగు యేఁబదేనుఁగు లనంతము లైన రథేభ్యకాచయం
బులు నొకవేయులొట్టియ లపూర్వవిభావిభవంబుఁ దెల్ప
చుం, గొలువ రఘూత్తముని గనుగొనఁ జనుదెంచె నా రాజతి
త్వరన్. 164

వ. ఇట్లు మున్ను మఱచి యనన్యసామాన్యసామ్రాజ్యధురంధ
రుం డగు నా రాజపురందరుండు గంధబంధురసింధురస్కం
ధంబు నధివసించి విచిత్రమ్ము లగు పెక్కు మూఁకరాజులు తొరఁగాఁ
తుం డై సపరివారంబుగా నడుగుడెంచె ముసన్నాహము. 165

తే. దక్షిణమిత్రంబు లోకకొన్నిఁ దోచె నదుము
దానభావభ్రేషసూచకంబగ నటంచు
నెఱిఁగి యెఱుఁగక పల్కించి రెండవేసి
కారణము దీర్పఁబోల దేవారిగాస. 166

శా. ఆసన్నాహవిజృంభితస్ఫురణచే నారాజచంద్రుండు శై
లాసక్తోద్ధరతుంగశృంగగకేలీలాకందరం బుంచితో
ల్లాసప్రౌఢిమదిగ్ద్విసింగము ప్రియస్ లావణ్య మింపొదఁ గ్రీ
డాసన్నాహసముజ్జ్వలద్గజము నెక్కెం జెక్కు యుల్లాసన్. 167

సీ. నిశితాసిపాణులై నిలిచి శిఫాయీలు
పేరిమతో వ్యాని సలాముసేయ
నానమణిమకుటాంశుమాలికలతో
సామంతనృపులు సాష్టాంగ మెరఁగఁ
గలధౌతమయకనత్కనకవేత్రములవారు
బలసి ముంగల బరాబరులు సేయ
వందిమాగధులు కైవారముల్ ప్రకటించి
కొమరైన బిరుదుపద్యములు చదువ
తే. మదవద్దైరావతముమాడ్కి మందమంద
గతుల నడయించి వచ్చి యుద్ధతులముల్కు
గారి సందర్శన మొసర్చె గౌరవమున
కొంచె మొక్కింతలేక యారాచపట్టి. 168
తే. దర్శనానంతరంబునఁ దత్తదుచిత
బహుబహూకృతు లొదవె శుంభత్సుదేభ
శోభమానాంశుకాదికలోభనీయ
రాజితోపాయనములు బరస్పరంబు. 169
ఉ. అంత ననంతసంభ్రమసమంచితమైన మనంబుతో ధరా
కాంతుఁడు దంతపుంబని చొకాటపు నీటిమెఱుంగు గెంపు
రా, దొంతరవింతసంతనలతోఁ దగు పాలకి నెక్కి వచ్చి ని
శ్చింతమెయిన్ నివేశనము జేరె వడిన్ దివిటీలవెల్గునన్.
సీ. గుబ్బెత లందిచ్చు గోదావరీనదీ
స్వాదూదకంబుల జలక మాడి
శారదచంద్రచాంద్రీరోచిరుద్వాహ
దములైన ధౌతవస్త్రములు గట్టి

శ్రీ ర స్తు.

శ్రీహయగ్రీవాయనమః.

---

# రంగారాయచరిత్రము

## ద్వితీయాశ్వాసము.

---

క. శ్రీజానకీంద్రచరణాం
భోజాతాయత్తచిత్తపుష్పంధయ ఘో
రాజిస్థలీజితాహిత
రాజన్యచమూనికాయ రామారాయా. 1

వ. అవధరింపు మనంతరకథావిధానం బెట్లు జరిగె నని యని మిషేశ్వరుండు దివిజకర్షంది నడుగుటయు నతం డతని కిట్లనియె. 2

చ. గజఘరజంగుదర్శనవికాసితచారుముఖారవిందుఁడై
నిజపరివారవారపరిణీతమహాకుతుకంబుతో ధరా
భుజతిలకంబు సొం పెసఁగెఁ బుంఖితనైజమయూఖమంజుల
వ్రజపరివేష్టనాధిగతవర్ణ్యరుచిస్ఫురదర్కవైఖరిన్. 3

సీ. ఒకవంక నాప్తరాజకుమారసంతతుల్
సరససల్లాపముల్ సలుపుచుండ
నొకవంక రాజకార్యకళావిశారదు
లగుప్రధానులు రహస్యములు దెలుప

నొకవంకఁ గోవిదప్రకరముల్ నిరతంబు
ఘనతర్కశాస్త్రంబు లనువదింప
నొకవంక నిపుణవైణికవాంశికనికాయ
గాయకుల్ గానసంగతులు సలుప
తే. నోలగం బుండి తనలోన నూహఁ జేసి
యతిభయావహయవనసభాంతరస్థ
జనమనోహారభూరివచఃప్రసంగ
శీలు నొక్కవకీలు నీక్షించికొనుచు. 4

క. యావనసభాంతరంబుల
నీవు బహుప్రౌఢి మెలఁగ నేర్పరివి వచః
ప్రావీణ్యశాలి వని సం
భావింపుచు రాజకార్యఫణితిం బలికెన్. 5

చ. యవనజనావతంస మగు హైదరుజంగు కచేరిఁ జేరి నీ
వివిధవచోవిచక్షణత వేడుకఁ గొల్పఁ గళింగసీమలోఁ
దవిలిన రాచకార్యము యథావిధిగాఁ బయికంబుతో నిఖా
వివరణఁ జేసి మాకు సెల విం డని తెల్పుడుఁ జేసి వెండి
యున్. 6

శా. ముందెల్లప్పటికిం గళింగమునకున్ మోతాదుగాఁ గన్ జమా
బందీద్వాదశలక్షరూపికల కేర్పాటున్నదా చొప్పు పెం
పందన్ సా మిపు డిచ్చి పుచ్చెదము పర్యాయంబునన్
సాము మీ,కుం దోడ్తోడన మీరు లేచి తిరుగా గోదావరిం
దాఁటినన్. 7

క. అని రాజకీయసంగతు
లనువుపడం దేటపఱచి హైదరుజంగుం

గని పునరుత్తరములు వే
గొనిరమ్మన రాయభారి గొబ్బునఁ జనియెన్. 8

మ. చని యారాజశిఖావతంసము సమంచత్ప్రీతిఁ ద౯ బంపు ని
ప్పని తీరు ల్సరకారుతోఁ గలజమాబందీవిచారంపు జొ
ప్పును దన్నిష్కృతియు౯ దదర్థనియమంబుల్ సమ్మదస్ఫూ
ర్తి నొయ్యన నా హైదరుజంగుసాహెబున కాద్యంతం
బునుం దెల్పినన్. 9

ఉ. హైదరుజంగుసాహెబు రయమ్మున నిట్లనియె౯ వకీలుతో
నాదర మొప్పఁ బైకమున నైనవిచారము లేటికమ్మ దీ
నాడిరగా మొలాజుమతునామది రంజిలుఁ దద్రిరంగనే
కాడనరాదవశ్యము త్రికాకుళ మూనఁగ వత్తు మిత్త్రతన్.

తే. ఇవ్విధంబున నానతీ నవ్వకీలు
లు మలిపిన ప్రతిమనుబోలి మరలి
రాచబిడ్డకు విన్నపం బాచరించెఁ
బెనచి హైదరుజంగు వల్కిన తెఱంగు. 11

శా. ఆవార్త ల్విని రామరాజవసుధాధ్యక్షుండు కౌటిల్యచే
ష్టావైదగ్ధ్యము మానసాబ్జమునఁ దొట్ట౯ సాహెబుం గొం
చు తా, నావిర్భూతమనోవికారగతిఁ బర్యాయంబునం బుట్టు
శో, భావృత్తుల్ గనలేక బొబ్బిలిగడీ పైడించు దుశ్చేష్ట
తోన్. 12

శా. మీతోఁ గొంతప్రసంగసంగతికి నెమ్మి౯ ముచ్చట ల్సేయఁగా
చేతఃప్రీతి జనించి యున్నయది మీచిత్తంబునం దెట్లయ
ట్లే తేజంబున నందు నన్నియును సందేహంబు లేదిందు నేఁ
బ్రాతఃకాలమునం దెవచ్చితమతో భాషించెద౯ సర్వమున్.

చ. అని పునరుత్తరంబులు దదాత్మకు హర్ష మెలర్ప దూత నో
క్కనిఘను నంచియుంచితవికాసమున న్నిదురించి లేచి ప్రా
ర్థనఁ జని యాప్తవర్గములతోఁ బొడగాంచి యభీష్టగోష్ఠిన
ర్తినలఁ దురుష్ఠ నేతకు ముదంబొదవం దగురీతి నుంచుచున్.

వ. తనయంతరంగంబునం బొడమిన యన్యాయసూచకాసూ
యావిశేషంబునకు సశేషంబునకు ననుకూలంబుగా నస
హ్యాజనకంబు లగు నుత్తరంబు లయ్యనఘపుంగవునకుం గ
అపువాఁడై ప్రసంగవశంబున. 15

ఉ. భూరితరాభిరమ్యరుచిఁ బొల్పగు నూసరకాఁగులోఁ జమీ
దారులు వెల్మవారు భుజదర్పసమాహృతవైరివీరభూ
మీరమణీమనోరమణమేదురరాజ్యరమాంగనామణీ
వారపరిష్క్రియుల్గలరవార్యులు బొబ్బిలిపట్టణంబునన్. 16

సీ. పాండవేయులభుజాపాండిత్యసామగ్రి
కార్తికేయుని పరాక్రమసమిష్టి
గంగాతనూభవురంగత్ప్రతాపంబు
హరునిదోశ్శౌర్యమాహాత్మ్యకలన
విక్రమార్కునిభూరివిక్రమప్రక్రియ
సంకర్షణుని మహాసాహసంబు
కార్తవీర్యార్జునకలితబాహాశక్తి
పరశురాముని యుగ్రపౌరుషంబు

తే. ప్రమదమున సంగ్రహించి శూరప్రపంచ
కల్పనాకల్పచాతురి గానుపింప
నంచితప్రౌఢిమమున నిర్మించఁబోలు
సలిలభవసూతి బొబ్బిలివెలమదొరల. 17

తే. ఉగ్రనరసింహమూర్తులై యొప్పువారి
సాహసమ్మున కన్యరాజన్యసమితి
రహి వహింపక యున్నె హిరణ్యకసిపు
లీల లిఁక నేల దచ్ఛౌర్యశీల మరయ. 18

తే. అంబరమణిప్రభావవిడంబనంబు
ఘనతరోజ్జృంభితప్రభాకరనిరూఢి
వెలయఁ జూపట్టువా రౌట వెలమవారు
పద్మనాయకు లౌట స్వాభావికంబు. 19

శా. గారా మొప్పఁగ దాదు లుజ్జ్వలరసాంకప్రౌఢిదోశ్శౌర్యపుం
బీరం బాతని కుగ్గుతోఁ బెనచి త్రావింపంగ బోల్పిన్ననాఁ
డారూఢి న్సహజప్రతాపనిధు లాహా వెల్మవా రందు రం
గారాయప్రభుసాహసం బెసఁగు బంగారంపునెత్తావియై.

ఉ. భండనభీముఁ డార్యజనబంధుసముద్రుఁడు భాగ్యవైభవా
ఖండలతుల్యుఁ డర్థిజనకల్పమహీజము భూపలోకమా
ర్తాండుఁడు వైరివీరభటదర్పవిదారణబాహువిక్రమో
ద్దండుఁడు రావురంగవసుధావరుఁ డాతని నెన్న శక్యమే.

తే. అతనిఁ గొల్చిన కమ్మకట్టైనబలము
బలమురాంతక గాంగేయపాండవేయ
కార్తికేయ రఘూద్వహ కార్తవీర్య
జామదగ్న్యాదికాంశాభిజాత్యసరణి. 22

మ. అకలంకస్థిరధైర్యనిర్మథితమంథాహార్యుఁ డైనట్టి రా
వుకులాగ్రేసరు సన్నిధానమునఁ జెల్వుం జూప నొక్కొక్కఁడే సే
వకుఁడే చాలును ఖాన్మహాలఘవుఁజుల్వంచించితే ఘోటక

ప్రకటాటోపము వీటిఁబుచ్చుటకు దృప్యద్దోర్విలాసంబునన్.

సీ. కరుగునఁ బోసెనో ఘనభుజాపాండిత్య
భావంబు సవరించి యావిరించి
గనిగాఁగఁ దేలెనో గాఢవిక్రమకళా
కౌశలప్రౌఢి యొక్కంటఁ గూడి
మొలక లెత్తెనో రసాతలవలత్ఫణివాంత
విషవహ్నికీల లుర్వికిని వెడలి
పక్షినాయకులరూపములఁ గైకొనియెనో
నారాయణుని సహస్రారధార

తే. దారుణాటోపదీపితౌద్ధత్యు లగుచు
బొబ్బిలిపురస్థలమ్మునఁ బుట్టఁగన్న
వెలమకొమరులవడి యెన్న నలవి యగునె
నలువకైనను వేనోళ్ళ చిలువకైన. 24

శా. రంగారాయనృపాలసోదరుఁడు ధైర్యస్థైర్యమంధాద్రిరా
వెంగలాద్రియఁడు బారుటీటెఁ గొని దోర్వీర్యంబుసం దూ
గినట్, గంగానందనుఁ డైనభీముఁడయినట్ గాండీవియైన
న్వడిట్, భంగం బొందరె ఘోరవీరరణభూభాగంబులట్
వ్రేగుగన్. 25

సీ. చెలికాని వెంకయ్య యలఘుదోర్వీర్యంబు
ధనదుని చెలికాని దాఁటనోపుఁ
దాండ్రపాపయ్యప్రతాపనైపుణ్యంబు
పెఱరాచతాండ్రల పెంపు డింపుఁ
దామరధమ్మభూధవుఁడు మార్తురమోము
దామరసిరులచందము లడంచుఁ

గాకర్లపూడి వేంకటరాయభూజాని
యనుపొంద జయలక్ష్మి కాకరంబు
తే. ముత్తియము లెల్ల నొకచోట హత్తినట్లు
మగటిమిఁ జెలంగు వెలమ లామన్నెపిన్న
వాని బొబ్బిలికోటలో వన్నె మెఱసి
యున్నవా రింక వేయేల యోనవాబ. 26
క. ఆబొబ్బిలిగడిపై తెర
గాబురుజులపై నెసంగు నాగ్నేయకళా
క్షీబదయోమయమైన య
రాబాసాం పెన్న నెన్నరా దెవ్వరికిన్. 27
సీ. క్రొవ్వాఁడి వసియూర్పుగుమిదొర గా నిష్ఠ
బలితంపు లగ్గదింపుల బెడంగు
మొసలు గామలచి తీర్చిననీలిశాసపు
గురిజాతి దంచిన గుల్లసొబగు
నూనె కాకలఁ దేఱి జూనైన చిగురుటం
బలిఁ గాచు పెనములపదనుతీరు
యీగకాలంతైన నెత్తిపాఱని గుఱి
నలవోని గుండు కోపుల యొయూర
తే. మారసాతలకలితగభీరనీర
పరిలుఠన్నక్రకమఠాహిభయదపరిఖ
యౌర బొబ్బిలికోటమాహాత్మ్య మరయ
నబ్బురము నింపదే యేరికైన నహహ. 28
ఉ. బెబ్బులిమీసమైన మెలిపెట్టి తెమల్పఁగవచ్చుఁగాని హా
నిబ్బరగండఁడైన ధరణీపతి రావుకులీనుఁ డేలు నా

బొబ్బిలికోటపై నడచి పోరఁగ రాదు కిరీటికైన మా
యబ్బపదంబు లాన నిజ మాడెద హైదరుజంగుసాహెబా.

మ. మదదంతావళగండశైలమరిభీమస్యందనత్కావహాం
బుదితక్షిప్రహయావళీహరిణముద్యోతత్ప్రతాపాతపా
స్పదపాదాతమృగేంద్రమవ్వేలమరాజకుంరమంథాద్రినై
ర్వ్యదధిః ప్రచ్చుట వింతయే ముసలిమా నుర్వీపతిగ్రామణీ.

ఉ. నాలుగువేలకాల్బలమనారతముం దనుఁ గొల్వ నాపయిం
జాలిన మేటిమానసులు సాహసధుర్యులు పద్మనాయకుల్
కాలునఁగాలు మెచ్చికొనగాఁ దగియుండు సహస్రమస్త్రహీ
పాలునియొద్ద నాఘనుఁడపారపరాక్రముఁడెన్నిభంగులన్.

ఉ. కావున పద్మనాయకశిఖామణి గ్రుసు మహానుభావుఁ డా
రావుకులాగ్రగణ్యుఁడు దురాగ్రహబాహుబలప్రభూతగ
ర్వావిలమానసుం డయి దివాణమువారలఁ జరికిం గొనం
డావిభుఁడెట్టిధన్యుఁడో భయంపడఁడెంతటిఖాన్నిఘూలకున్.

తే. సీమలోపల పితరులు చేసికొనుచు
సిస్తు వడనీఁడు పైకంబు దస్తుగాఁగ
నివ్వఁ డవ్వేల నిఁక నేమి అవ్వబలుక
వారు తమజేరు దస్తులో రాదు నిజము. 33

మ. అని రాజన్యునితప్పు దాట్లు కుటిలవ్యాపారసంభాషణల్
వినుచో హైదరుజంగుసాహెబు కడు న్విస్మేరచేతస్కుఁడై
నిను ము న్వింద మమందశౌర్యకలనాని స్తంద్రసైన్యావళీ
ఘనసంరంభి వటంచు నవ్వేలమ నీకన్నన్ బలాఢ్యుండొకో.

మ. అన నారాజవతంసుఁ డిట్టులను నాహా తాండ్రపాపయ్యనాఁ
జనువాఁ డొక్కఁడె చాలు మామకభుజాశౌర్యంబుఁ గో

ల్పుచ్చు తెం, పున కామన్నకుమారుపౌరుషరసంబు ల్వాల్కా
గా నేల న, ర్జునగంగాసుతకుంభసంభవులనేర్పు ల్గావె తద్ద
ర్పముల్. 35

తే. అనుచు నారాజుపలికిన యాగడంపు
ముచ్చటల కబ్బురం బంది మొఱకుతురక
కఱకుఁదన మూఁది కొనవేఁ్రలిఁ గఱచికొనుచు
నాగ్రహమ్మున నతనితో ననియె నిట్లు. 36

శా. ఏలా జేరుకురాఁ డతండు పయికం బేలా దివాణాన కీఁ
జాలం డస్మదపార ఘోరనిబిడజ్వాలాకరాళాయితా
భీలక్రూరశతఘ్నికానికరగంభీరారవప్రౌఢిమం
బేలా గుర్తెఱుఁగండుచూతమిఁకఁ దద్భీమప్రతాపోద్ధతుల్.

శా. కీలాభీలము లిప్పరాసులఫిరంగీ లగ్నిమూర్తు ల్మహా
కాలుం డైనను గాలుఁడైన నెదురంగా నోప రిచ్చోట మ
న్నీ లంచుం బలుకంగ నేటికి పఠాణీల న్నిరాణీతురా
ణీల న్గోటను జిమ్మలేదె మును బిన్నీ బారులం బోరులన్. 38

సీ. తలఁపుతాళ్ళిళ్ళలో మెలఁగఁ జేసితిఁగదా
శకసింధుఘూర్జరాశ్మంతపతులఁ
జేరుదస్తునకుఁ దెచ్చినవాఁడ నేకదా
మరహాట కరహాట మత్స్యపతుల
ధర బందిగీలఁగాఁ దార్చి తెచ్చితిగదా
మాళవ చోళ నేపాళనృపుల
తజవీజులో మెల్ల రుజువు జేసితిగదా
నానావనగ్ఱరాల నాఁడునాఁట

తే. పాదుషావారి మీరు బరీదు సైదు
ఢక్కను మొగల్గరీబుపఠాణు లాది
ఫౌఁజులఁ బలాయన మొనర్చుపటిమ గల్గు
తురకదొరలము మాకు హిందువులు భరమె. 39

తే. సిఫహాసరదారుగారితో జిడ్డుగొన్న
కవ్వడికి నైనఁ గాందిశీకత గడంగు
మన్నవా రనఁగా నెంత మాఫిరంగి
మండలంబుల ఘుటికాప్రచండగతికి. 40

చ. అతనిగడీపటుత్వమును నాతనివిక్రమశక్తి తస్మహో
ద్భుతు లగు పక్షనాయకుల దోర్బలవైఖరి యెన్న నేల మ
ద్వితతశతఘ్నికానికరవేగము మమ్ముల మాఘరాసుసం
తతులపరాక్రమక్రమముఁ దల్పఁగ లేవయితే నృపోత్తమా.

చ. అలఁతుల బోవనేర్తురె దురాగ్రహచిత్తులు నిప్పరాసులు
జ్వలతరధాంధమీనినదసత్వరభూరిభయానకార్భటీ
కలితశతఘ్నికాతతినగాదులు దెల్పుచుఁ గొండలైన బ
ద్దలు వడి వ్రాలఁ జేయఁ గల తద్గతి కిట్టిగడీలు లక్ష్యమే.

ఉ. అంగభవారిభూరినిటలాంబకవహ్నికణంబులట్లు లు
ప్పొంగుచు గుండు వ్రాలునెడ భూగగనస్ఫుటనాకఠోరతా
భంగురకాలమేఘరవభైరవరావము లుగ్గడింప కా
రంగులు మాఘరంగుల ఫిరంగుల రంగులు మీరెఱుంగరే.

శా. లాడూఖానుకుమంద మొక్కరుఁడె కిల్లాలెల్ల లగ్గ్గొనెం
గ్రీడాశాలి ఫరాసుతేని కెదురేరీ మున్ను లోకత్రయిం
జూడ న్నాయిశిఫాయి గుంపులభుజాస్ఫూర్జత్ప్రతాపంబు లే
డేడం గన్నవిమాకలక్ష్యములుగా హిందూలదోర్దర్పముల్.

శా. కానిమ్మెంతప్రయోజనం బనుచు న్యక్కారంబుగాఁ బల్కు
నా,ఖానోత్తంసముఁ జూచి రాజు మదిలోఁ గౌతూహలం
బంది యెం,తైన న్సామము దాన భేదములుగా వప్పట్టునం
జూడ నా,భూనాథాగ్రణి దండసాధ్యుఁ డని నీబుద్ధి న్వితర్కింపుమా. 45

మ. అని యాఖానుని మానసం బెఱియఁ గ్రూరాలాపము ల్గొన్ని ప,న్ని నిజాంతఃకరణంబున న్మెలఁగు దుర్నీతిప్రసంగం
బునే,ర్పున విజ్ఞప్తి యొనర్చు వేళ గలిగెం బోనేఁడుగా మాక
టం,చునుదీర్ణప్రతిభావిభాసితముఖాబ్జుండౌచు రాజంతటన్.

మ. బలవద్విక్రమశాలినా నృపుని మీబల్మి న్నివారించి బో
బ్బిలిలో మమ్మభిషిక్తుఁ జేసి పిదపం బెంపేది తద్రాజ్య మె
ల్ల లసత్ప్రీతిని మా కొసంగినను గీల న్మీకుఁ బంద్రెండుల
క్షలరూపాయలు పాయనంబులుగ రొక్కం బిత్తు నిక్కం
బుగన్. 47

శా. ఆమాటల్విని ఖానుఁ డస్థికృతమా నత్యాశ దీపింపఁగా
నామీఁదం బ్రభవించు హానికిని బాపాయ త్తదుర్వృత్తికి
న్మోమాటల్గన లేక మంచి దని సమ్మోదంబునం బొందెఁ జా
లా ముఖ్యంబుగ నర్థకాంక్షకుల కేలా యూర్జితాలోచనల్.

మ. అలఘుప్రాభవ రాజవర్య భవదీయాశాస్య మెట్లట్ల బో
బ్బిలిఖిల్లా కధికార మిచ్చి నిను నొప్పింతుం దదావాసుల
న్మలలం జొన్పుదు సాహుకారుతసిలీ మ్మాకిచ్చి కట్టంబుతోఁ
గలకార్యంబిది రూఢిసేయుమన నాక్షత్రాగ్రగణ్యుం డొగిన్.

తే. పారసీకాగ్రగణ్య నీపరమమైన
చారుకారుణ్యరస మిట్లు సంభవించె

దాన విశ్వాస ముదయింపఁ దగినకొలఁది
నమ్మికలు సేయు టిది మాకు సమ్మతంబు. 50

క. పరిధాన మిచ్చుపలుకులు
కొఱఁ గాదన మిపుడు మీరు కోరినవారిక్
నెఱతనపుసాహసుకారులఁ
గర మరుదుగఁ గూర్చి పూఁటకాఁపులఁ జేతున్. 51

క. విశ్వాసపుట్టునట్లుగ
శశ్వద్గతి మాకు నమ్మఁజాలినరీతిక్
విశ్వస్తుతగుణయవనా
ధీశ్వర ప్రామాణ్య మొసఁగు మిత్త్రతఁ జనుడున్. 52

శా. తేజం బంది తురుష్కనేతతనయుం డస్మాద్ధృ దీపింప రా
జాజీ సీమదిలోన నింతవసవాసాసర్వదిఙ్మండలీ
భ్రాజత్సత్యపరాక్రమప్రకటితప్రాంచద్యశశ్శాలికిక్
నైజం బొక్కటికాక మారు గలదే నావాక్యము ల్పొల్లులే.

క. హల్లాసేయుదు బొబ్బిలి
కిల్లాతజ్జయము నీకుఁ గీల్కొల్పుదునే
కల్లాడఁ జుమ్మి యిది నా
యల్లాచరణంబు లాన యధిపవతంసా. 54

మ. అని రాజన్యుని పాణిపల్లవము స్వీయంబైన కెంగేల గై
కొని రమ్మంచును దోడుకొంచుఁ జనుచుం గోదావరీతీర
కా, నన దేశంబున నొంటిపాటున శమే నాలోసఁ గూర్చుం
డి యా,జననాథాగ్రణి యాత్మ మెచ్చఁగ నభీష్టాలాపము
ల్వల్కుచున్. 55

తే. కపట మొక్కింతలేక నిక్కమ్ముగాఁగ
ఖానుఁ డర్థంబుపై దృష్టిఁ గట్టిపఱచి
నృపమణికి నిచ్చె నమ్మిక ల్కృప దలిర్ప
ఘోరతరమైన యొకతరవారు ముట్టి. 56

శా. కర్త్రిం గొట్టి ప్రమాణపూర్వకముగా ఖానుండు నమ్మించి
సం,జిత్తస్వాస్థ్యము నొంది క్షత్రియకులశ్రేష్ఠుండు తౌరు
ష్కరా,వుత్తగ్రామణిమానసం బలర సాహూకారుటీపి
చ్చి సో,ద్వృత్తి న్వాని యనుజ్ఞఁ గైకొనుచుఁ జేరెన్ వేల
మాత్రీయమున్. 57

వ. ఇవ్విధంబున విజయరామరాజధరారమణావతంసంబు సంసత్ప్రాకారంబునఁ దనమనోరథంబునకు ననురూపాటోపంబులాచరింప నిరపాయం బగు సహాయంబున కనుకూలించు కతనం జతనం బగు మనంబున జనించు నప్రతీపప్రమోదంబు ప్రమాదంబునం బరఁగ నారేయి నిలచి చలిచీమకాటుగా దనయొనర్చు కుయుక్తిచేష్టావష్టంభంబు లోకులకు నించుకించుక సూచించుచు మఱునాఁటియుదయకాలంబున.

శా. రాచక్రంబున మేలుబంతి యనఁగా రాజిల్లు నాగాజుకూ
చీఁ జేయించి సమంచితాత్మబలవత్సేనాసమేతంబుగా
భూచక్రం బద్రువంగ బూరటిలు విస్ఫూర్జత్సమిద్భేరిస
ధ్రీచీనంబుగ మున్నుగాఁ గదలి యర్థిం జేరెఁ బెద్దాపురిన్.

తే. ఖానుఁ డంతట నతులితోత్కర్ష మెఱయ
నుద్ధతులముల్కుగారితో నొయ్యనొయ్య
రాజుఁ దానును సలుపు వార్తారహస్య
మంతయును దెల్పె నతనికి హర్ష మొదవ. 60

క. మూసాబూసీవారిదు
బాసీలక్ష్మణసమాఖ్యఁ బరఁగు నతం డు
ద్భాసితమనస్కుఁడై తా
నాసా హెంబుపన్నగడకు ననుకూలించెన్. 61

శా. ఆరాజన్యుఁ డొనర్చు దుర్నయవిచారాలాపచేష్టావిధుల్
మేర ల్మీఱుచు నంతకంతప్రచురోన్మేషక్రియావైఖరీ
రారాజద్గతి నెల్లవారలకుఁ గన్పట్టెన్ స్వతం త్రాంతఃపురాధ్యక్షుకున్
గారాయప్రభుమాళియున్నవని యెఁదకౌటిల్యవార్తాస్థితుల్.

సీ. ఈరాచబిడ్డని కూరిరకర్మ విచార
మిదియ నూర్జిత మని యెన్నువారు
పౌరుషశాలిరంగారాయనృపమౌళి
వెనుకఁ ద్రొక్కం డని యనెడువారు
ఘనులు వీరుం డొరు లకఁలహింపఁ దద్ధరా
జనులకుఁ దొరిక్కటం బనెడువారు
జయపరాజయములచందము లెలుప దై
వాధీన మిది యని యాడువారు

తే. నిర్నిమిత్తవిచార మీదుర్నయంపుఁ
బనులు బలనాశకర మని పల్కువారు
నెవ్వ రెట్లయ్యెదరొ వీర లిట్టికలత
ననుచుఁ జింతానిమగ్నులై రఖిలజనులు. 63

తే. అత్తెఱంగునఁ దమలోన నఖిలజనము
లిలఁ గలుగువారు పలువురుఁ బలుదెఱఁగుల
పలుకులవిచారములఁ గుంది కలఁతనొంది
డెందములయందు ఖిన్నతఁ జెంది రంత. 64

శా. రంగారాయనిగారు గారుడశిలారంగద్వితర్దిజ్వల
చ్ఛృంగారాయతనంబునందుఁ బెలుచం జెంగల్వ రాచె
ల్వరా, సింగంపుం దనుపైన గద్దియపయిం జెల్వొప్పఁ గూ
ర్చుండి స్వస్థాంగప్రాంచదమేయరాజ్యభరణప్రజ్ఞామహోద
గ్రుఁడై. 65

మ. హితులు న్మంత్రులు గాయకుల్కవులు సాహిత్యప్రధాను
ల్పురో, హితులు న్నాయకులు న్సఖుల్సహజులు న్వేలా
గతిం గొల్వ న్వప్రతిమోల్లాసవికాసలాలసమనఃపంకేరు
హుండై నిజా, స్థతతిం జూచి రసోచితంబుగ వినం బల్కె
న్మృదూక్త్యుర్భటిన్. 66

సీ. సరకారుభారంబు వరియించి పెల్లుగా
వడి ఫరాసెకిమీఁదు వచ్చుటయును
విజయరామక్షమావిభుఁ డాదిగా జమీ
దారులెల్లను వానిఁ జేరుటయును
దత్ప్రధానత్వంబు దాల్చు హైదరుజంగు
రాచయేలికపక్షమై చనుటయు
మనమీఁదివైరంబు పెనఁకువతో రాజుఁ
జొప్పించి కొండెము లొప్పుటయును
తే. లక్షలకొలంది పైకంబు లంచ మిచ్చి
రాజు మనపైకి జాతివారలఁ గురించి
వచ్చి కలహించి యీరాజ్యవైభవంబు
తా ననుభవింపఁ దలఁచుట దా నెఱింగి. 67

క. అనిమిత్తవైర మీచొ
ప్పునఁ దలపెట్టినవిరోధి భూపతి యాఖా

